# స్వవిషయం



కాలచక్రం ఎవరికోసమూ ఆగకుండా గిర్రున తిరిగి పోతోంది. కాలానుగుణ్యంగా రాజకీయ- సాంఘిక- సాహిత్యా రంగాలలోకూడా అనుక్షణం మార్పులు వస్తున్నాయి. ఈ మార్పుల్నిబట్టి ప్రజాసామాన్యం పురోగమించడానికి అవసరమైన విజ్ఞానాన్ని పంచిపెట్టవలసిన బాధ్యత నేటిపత్రికలపైనా, గ్రంథాలపైనా వుంది. ఈకర్తవ్యనిర్వహణకు పాటుపడడమే "పాంచజన్యంపబ్లికేషన్స్" ప్రారంభించడంలోగల ప్రధానాశయం.

ఈ మాకృషికి యావదాంధ్ర ప్రజానీకం దోహదమిచ్చి అన్నివిధాలా ప్రోత్సహిస్తుందని విశ్వసిస్తున్నాను.

దంటు కృష్ణమూర్తి.
ఎడిటర్,
పాంచజన్యంపబ్లికేషన్స్.

కాకినాడ,
1—7—53.



## ఈ గ్రంథరచనకు తోడ్పడిన యితరగ్రంథములు

1. Akhanda Hindusthan By K. M. Munshi
2. Consequences of Pakisthan By K. L. Gauba
3. Inside Pakisthan ,,
4. Hydrabad By Dr Lanka Sundaram
5. India, Pakisthan and west By Percivial Spear
6. Pakisthan By Dr. Ambedkhar
7. Indian States in free India By KevalramC.Oza (Telugu)
8. Hindumahayugam By K. V. Lakshmanarao (Telugu)
9. India Divided By Dr. Rajendraprasad
10. Misson with Mountbatten By Johnson

# కృతిసమర్పణ

అఖండమేధావులు

అంతర్జాతీయ రాజకీయవేత్తలు, పార్లమెంటుసభ్యులు

నామిత్రులు అయిన



డాక్టర్ లంక సుందరం, ఎం. ఏ. పి. హెచ్. డి.

(లండన్) గారికి

గౌరవపురస్సరముగా నొసగబడినది.

కోటమర్తి చినరఘుపతిరావు.

# పీఠిక.



మన హిందూదేశముయొక్క నాగరికత, సంస్కృతి, యుగయుగములనాటివిగాని యీనాటివిగావు. ఋగ్వేదాదులు 4, 5 సంవత్సరములక్రిందట వ్రాయబడినవని ఆధునికచరిత్ర కారు లూహించి వ్రాసినది సరికాదు. ఋగ్వేదకాలము ఏపాతిక ముప్పది వేలసంవత్సరములక్రిందటిదో కాని యీలోపుది కాదు. సస్యశ్యామలమై, సర్వసంపదలతోను తులతూగు మన దేశమును వివిధమతస్థులు తమభుజబలముచేతనో, మాయో పాయములచేతనో గెల్చుకొని యింతవరకు పరిపాలించిరి. వారిలో కట్టకడపట మనదేశమును పాలించిన క్రైస్తవమతస్థులు హిందూమహమ్మదీయులమధ్య వైషమ్యములుపెంచి దేశమును రెండుగా బ్రద్దలుకొట్టి, పరిష్కరించుటకు దుస్సాధ్యమైన వైరకారణములు కల్పించి వెడలిపోయిరి. ఎన్నిమతములవారు హిందూదేశమును పరిపాలించినను హిందూమతముమాత్రము చెక్కుచెదరక యితరమతములను తనలో జీర్ణింపచేసుకొన్నది గాని మహమ్మదీయమతమునుమాత్ర మట్లు జీర్ణించుకొనలేక పోయినది. మహమ్మదీయులుగూడ హిందూమతము నవగాహనముచేసుకొనలేక, సర్వమానవసౌభ్రాతృత్వతత్వమువార్కి ...తవమగుటచేతను, సర్వేజనాస్సుఖినోభవన్తు అను వేదాంత ...మువారి కర్థముకానిదగుటచేతను మొదటినుండియు భేద

భావముతోనే నడచుచు అభేదభావమును వృద్ధిపరచుకొనిరేగాని చంపుకొనలేదు. కనుకనే మహమ్మదీయు లెప్పుడు హిందువులను తమబానిసలుగా చేసికొని రాజ్యాధిపత్యము చలాయించుటకు తాపత్రయపడుచు వచ్చిరి. దీని పర్యవసానమే గతవేయి సంవత్సరములనుండియు హిందువులపై మహమ్మదీయులు జరిపిన దాడులు, ఘోరకృత్యములు మున్నగునవి. మహమ్మదీయులు హిందువులపై దండయాత్రలు రెండువిధముల జరిపిరి. ఒకటి రాజకీయముగ దేశమునాక్రమించుకొని పరిపాలించుట, రెండవది హిందూమతము నణగద్రొక్కి మహమ్మదీయమతమును వ్యాపింపజేసికొని హిందూదేశమును చిరస్థాయిగా తమ చేతులలోనుంచుకొన యత్నించుట. ఈఅభిప్రాయముతోనే వారొకచేత తమమతగ్రంథమైన 'కొరాన్' ను వేరొకచేత ఖడ్గమును బట్టి మతప్రచారము నారంభించిరి. ఇందువల్ల వారు హిందువులతో సఖ్యము కుదుర్చుకొనజాలకపోయిరి. ఈవైషమ్యములనే ఆంగ్లేయు లాధారముగాగొని మహమ్మదీయులను హిందువులపై పురికొల్పి వారిచే హిందువుల నణగద్రొక్కించవలెనని యత్నించిరి. అందువల్లనే ముస్లింలీగ్ నిర్మాణం- కమ్యూనల్ అవార్డు- పాకీస్థాన్ విభజన సంభవించినవి. హిందూదేశమును తమఆధిపత్యముక్రింద నుంచుకొనుటకై మహమ్మదీయులు మొదటినుండియు సలిపిన పోరాటములు- చేసిన ఘోరకృత్యములు- బ్రిటీషుప్రభుత్వము మహమ్మదీయులకు చేసిన

దోహదము దేశవిభజనఫలితముగా వచ్చిన కష్టనష్టములు– తిరిగి ఇండియా పాకిస్థానులు కలసిపోయి "అఖండభారతము"గా వర్ధిల్లవలసిన ఆవశ్యకత, నిరూపించుటకే యీగ్రంథము వ్రాయబడినది. హిందూమతము- హిందువులు మొదట మహమ్మదీయప్రభువులచేతనే బాధింపబడి రానురాను మహమ్మదీయ జనసామాన్యముచేతగూడ అనేకవిధముల బాధింపబడుటచే నీవివరములన్నియు యిందువ్రాసితిని. హిందూమహమ్మదీయ వైషమ్యవిజృంభణమును నిరూపించుటయే యీగ్రంథము యొక్క మూలాశయము గావున యిది మహమ్మదీయచరిత్ర మాత్రమే నని చదువరులు భేదాభిప్రాయము పొందరని ఆశించుచున్నాను.

ఇట్లు,

కాకినాడ, 1–7–1953. } కోటమర్తి చినరఘుపతిరావు, రచయిత.

# అఖండ భారతము.



## మతవిషయములు

భూమి పుట్టి మూడుకోట్ల సంవత్సరము లైనదని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఇట్లు పుట్టిన భూమిలోని ఆసియాఖండపు మధ్యభాగమున మంగోలియా మంచూరియా లనుప్రదేశములు కలవు. ఇక్కడ నివసించెడి ప్రజలే వివిధదేశములకు వలసపోయిరనియు, అట్లు పోయినవారిలో కొందఱు ఖైబర్, బోలాన్ కనుమలలోనుండి సింధుతీరమునకు వచ్చి అచ్చట నివసించిరనియు, ఆసింధుతీరవాసులనే హిందువులని వాడుచున్నారనియు. ఈహిందువులను బట్టియే మనదేశమునకు హిందూదేశ మని పేరు వచ్చినదనియుకూడ చరిత్రకారులు వ్రాసియున్నారు. ఈదేశములోనికి మొట్టమొదట వచ్చిన ప్రజలిప్పటికి పదివేలసంవత్సరములకు పూర్వమున వచ్చిరట. ఈ సింధుదేశపునాగరకత బహు ప్రాచీనమైనదని మహెంజోదారో లోని శిథిలములనుబట్టి ఋజువగుచున్నది. ఈ ప్రాచీన సంస్కృతికే ఋగ్వేదయుగమని పేరు పెట్టబడినది. ఇందులకు కాలనిర్ణయము క్రీస్తుపూర్వము 2000 సం॥రములనుండి 1400 సం॥ల వఱకు గల కాల మనియు, ఈకాలములోనే ఋగ్వేదము పుట్టినదనియు, శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. అప్పాడు

పేయములైన యీ వేదములకు కాలపరిమితిని యేర్పాటు చేయుటయేగాక తిలక్ మహాశయుడు మొదలగు మహావిద్వాంసులు ఋగ్వేదము 7000 సంవత్సరములకు పూర్వపుదేకాని యీ లోపున పుట్టలేదని వ్రాసినను, నేటికి 4000 సంవత్సరములకు క్రిందటనే ఋగ్వేదాదులు వ్రాయబడినవని నిర్ణయించుట సాహసమనవచ్చును.

ఈ ఋగ్వేదయుగానంతరమున క్షాత్రయుగము వచ్చినదని చరిత్రకారులు వ్రాసిరి. ఈయుగమునకు కాలనిర్ణయము క్రీస్తుపూర్వము 1400 ల నుండి 1000 ల వఱకుగల కాలమని నిర్ణయించిరి. ఈకాలములోనే మహాభారతయుద్ధము జరిగినదని చరిత్రకారుల వాదము. కాని మహాభారతకర్త కలియుగ ప్రారంభమునకు 36 సం॥ముల ముందే మహాభారతయుద్ధము జరిగినదని వ్రాసియున్నాడు. మన పంచాంగకర్తలు కలియుగము పుట్టి 5052 సంవత్సరములైనదని వ్రాసియుండుటచే మహాభారత యుద్ధము జరిగి నేటికి 5088 సంవత్సరములు రమారమీ కావచ్చినదని చెప్పవచ్చును గదా! ఇట్టియెడ మహాభారత యుద్ధకాలము 3000 సం॥రముల క్రిందటిదని వ్రాయుట సత్యేతర మనవచ్చును.

ఇక మూడవది సూత్రయుగము. ఇది క్రీస్తుపూర్వము 1000 ల నుండి 557 సంవత్సరములవఱకు గల కాలమని నిర్ణయించిరి. ఈకాలమునందే కల్పసూత్రము, వ్యాకరణాదిసూత్రములు, షడ్దర్శనములు రచింపబడినవని చెప్పుదురు.

స్వల్పవది బౌద్ధయుగ మనియు, నిది క్రీస్తుపూర్వము 557 నుండి క్రీస్తువెనుక 500 ల వఱకుగల కాలమనియు, గౌతమబుద్ధుడు బౌద్ధధర్మమును ప్రబోధించి మతవ్యాప్తి గావింపించిన కాలమనియు, బౌద్ధధర్మగ్రంథములు, బౌద్ధవాఙ్మయము విజృంభించి విదేశములందుకూడ విశేషవిఖ్యాతిని గడించిన కాల మిదేయనియు చెప్పుదురు.

కట్టకడపటిది పౌరాణికయుగము. ఇది క్రీస్తుశకము 500 ల నుండి 1200 వఱకునుగల కాలము. ఈకాలములో రాజులచే నిర్మింపబడిన శిలాశాసనములవల్లను, పురాణములలో భవిష్యద్వార్తలని వ్రాయబడిన భూతపూర్వరాజుల వంశావళులవలనను మన కీకాలపు రాజ్యములనుగూర్చిన చరిత్ర తెలియుచున్నది.

ఇచ్చట బౌద్ధయుగమునుగూర్చి కొంచెము ముచ్చటింపవలసియున్నది. త్యాగమూర్తియైన బుద్ధుడు రాజ్యపరిత్యాగము జేసి 'అహింసాపరమోధర్మః' అను ధర్మసూత్రమును ఆధారముగ జేసుకొని స్థాపించినమతమే బౌద్ధమతము. ఈధర్మమును ఆధారముగ జేసుకొని యజ్ఞయాగాదిక్రతువులందు పశువధను ఖండింప బ్రయత్నించినందువలన యీబౌద్ధమతము హిందూమతమునకు విరోధముగ నయ్యెను. అప్పటికి కొన్నివేలయేండ్ల నుండి పాతుకొనిపోయిన హిందూమతబీజములను పెఱికివేయుటకు బౌద్ధమతమునకు సాధ్యపడక పోయెను. ఈబౌద్ధమతమునకు

మతవ్యాపకులు కేవలము బౌద్ధభిక్షువులే కాక నాటికాలపు చక్రవర్తులున్నూ దేశములకు తోడ్పడిరి. ఈ మతసిద్ధాంతము లను గూర్చి యిచ్చట కొంచెము వ్రాయవలసియున్నది.

---

## బౌద్ధసిద్ధాంతములు

ఈశ్వరుడు, జీవుడు, వీరికిగల సంబంధము మొదలైన విషయము లతీంద్రియములు. అవాఙ్మానసగోచరములు. అవి యజ్ఞేయములు. అనగా నవి యున్నవనిగాని లేవనిగాని తెలిసికొనుటకు వీలులేదు. కావున నిట్టివిషయములనుగురించి విచారించుట అనావశ్యకము. ప్రత్యక్షానుమానములే ప్రమాణములు. వేదాదిశబ్దములు ప్రమాణములు కావు. ఈ సృష్టిని గురించి వీరి ముఖ్యసిద్ధాంతములు నాలుగు. వీనిని బౌద్ధవరి భాషలో 'భావన' అనియెదరు. అవి యెవ్వియన,

1. "సర్వం దుఃఖం దుఃఖం" అనగా సంసారమంతయు దుఃఖమయము అని యర్థము.

2. "సర్వం క్షణికం క్షణికం" అనగా ప్రతిపదార్థము క్షణకాలముమాత్రమే యుండును. రెండవక్షణమున నుండదు. ఆత్మ యనునది యొక స్వతంత్రద్రవ్యము కాదు. విజ్ఞానము, వేదన, సంజ్ఞ, సంస్కారము, రూపము అను పంచస్కంధముల పరిణామము. ఇట్లు ఆలోచించునాత్మ యొకక్షణ

మును పంపెదు. క్రొత్తది వచ్చును. ముఖ్యముగా నిది విజ్ఞాన మయము. పూర్వవిజ్ఞాన ముత్తరవిజ్ఞానమును అవలంబించి తాను అంతరించును. ఇట్లు విజ్ఞానధార యెప్పుడును ప్రవహించుచుండును. అనగా నిది యొక నదివంటిది. ఎప్పటి కప్పుడు క్రొత్తనీరు వచ్చును. పాతనీరు పోవుచున్నప్పటికిని నదిమాత్ర మొక్క పేరటనే పరగుచుండునట్లు ఆత్మ యొక్కటియే యని చెప్పుట వ్యావహారికము.

3. 'సర్వం స్వలక్షణం స్వలక్షణం' అనగా సృష్టిలోని యొక వస్తువుతో నింకొక దానిని పోల్చుటకు వీలు లేదు. ఈవస్తు వావస్తువవలె నున్నదనుట తప్పు. కావున నేవస్తువులక్షణ మావస్తువునకే చెల్లును. ఇతరవస్తువులకు చెల్లదు.

4. "సర్వం శూన్యం శూన్యం" అనగా నంతయు సున్న యని యర్థము. ఈ చతుర్విధభావనల యథార్థజ్ఞానమువలన ముక్తి కలుగును. 'సర్వం శూన్యం శూన్యం' అను భావన యొక్క యర్థమునుగురించి బౌద్ధులలో నాలుగు శాఖాభేదములు కలిగెను. మాధ్యమికు లనువారు సర్వశూన్యత్వము నొప్పిరి. యోగాచారు లనుబౌద్ధులు బాహ్యశూన్యత్వమును మాత్ర మంగీకరించిరి. విజ్ఞానము సత్యమే యని వారి యభిప్రాయము. సౌత్రాంతికు లనువారు బాహ్యార్థములు కేవల మనుమేయములు కాని ప్రత్యక్షములు కావనిరి. వైభాషికులు బాహ్యార్థములు ప్రత్యక్షము లనియు, విజ్ఞానమే యనుమేయ

మనియు గ్రహించిరి. ఆ సిద్ధాంతమున కర్మమాహాత్మ్య మెక్కువ. ఇచ్చట కర్మ యన యజ్ఞయాగాది వైదికకర్మ గాను. మానవుడు చేయు ప్రతిపనియు కర్మయనియే యర్థము. చేసిన చెడుపనికిని మంచిపనికిని ప్రతిఫల మనుభవించి తీరవలెను. తప్పించుకొనుట యెవరికిని శక్యము కాదు. కావున చెడ్డపని చేయకయే యుండవలెను. చేసినయెడల దానిఫలము ననుభ వింపక తప్పదు. దేవునికి కొబ్బరికాయ కొట్టిన లాభము లేదు. మంచి చెడ్డ పనులఫలము లనుభవించుటకు పునర్జన్మల నెత్తు చుండవలెను. కాని జన్మరాహిత్యమును గోరువారు కర్మసన్న్యా సము పుచ్చుకొనవలెను.

తత్త్వవిచారము జనసామాన్యమునకు తెలియదు. కావున బుద్ధుడు నీతివర్తనమే యందరికి ముఖ్యమని శాసించెను. పరిశుద్ధాలోచన, పరిశుద్ధవాక్కు, పరిశుద్ధాచరణము నిర్వా ణమునకు ముఖ్యసాధనములు. పరోపకారము, భూతదయ, ధర్మముయొక్క ముఖ్యాంగములు. ఇవి యందరికిని సాధ్య ములు. బ్రాహ్మణునికి నాధిక్యము లేదు. శూద్రునికి నీచత లేదు. సత్ప్రవర్తనగలవా రెవ్వరయినను పూజ్యులే. ఇట్లందరి కి సాధ్యమైనట్టియు, నందరికి తెలియునట్టియు నీతితత్త్వము లను బోధించినందున నీధర్మములు బహుశీఘ్రకాలములోనే వివిధదేశములకు వ్యాపించెను.

ఈసిద్ధాంతము లన్నియు నాధారములుగ బౌద్ధమతవ్యాప్తి జరిగినది. కాన పిదపకాలములో జైనమతముగూడ వ్యాపిక

వచ్చినది. ఈ నూతనమతవ్యాప్తి బౌద్ధమతప్రబోధమునకు కొంతవఱ కంతరాయము కలిగించినది. ఈ యంతరాయము కలిగించిన జైనమతసిద్ధాంతములను సూచీముఖమున దెల్పుచున్నాను.

---

## జైన సిద్ధాంతములు

1. వేదము లపౌరుషేయములు కావు.

2. అరూపగుణుడను సర్వేశ్వరు డొకడు కలడు. వాడు సర్వశక్తిమంతు డయ్యును దటస్థునివలె నుండును.

3. ఈశ్వరుడు మనలను యిష్టమువచ్చినట్లు రక్షింపడు, శిక్షింపడు. మన సదాచరణ, దురాచరణములే మనలను రక్షించును, శిక్షించును.

4. సృష్టియు, జీవులును అనాదులు. అవినాశులు. వినాశము చెందునవి కావు.

5. ఈ భూలోకమునకు గ్రింద నేడునరకములును, పైని బదునాఱు దేవలోకములును గలవు. అన్నిటికి పైని బదునేడవది ఆగనిరాంద్రదలోకము కలదు. అందు సర్వేశ్వరు డుండును. పుణ్యాత్ము లచ్చటకు బోయెదరు. పాపాత్ములు నరకమునకు బోయెదరు.

6. ఇదివఱకు నిరువదినలుగురు తీర్థంకరు లనుగురువులు

వచ్చి వెళ్లిరి. వారిని దేవతలకంటె నెక్కువగ భావించి వారి ప్రతిమలను జైనులు పూజించెదరు.

7. అహింస యనునది వీరి యన్ని వ్రతములలో గొప్పది. రాత్రి భోజనము చేసిన చీకటిలో జీవకోటికి హింస కలుగు నేమో యని వీరు సాయంకాలముననే భోజనము చేయుదురు. వడియబోయని నీరు త్రాగరు. మొదట వీరిలో జాతిభేదము లేకపోయినను తర్వాత జైనులు జాతిభేదమును బాటించుచు శివవిష్ణ్వాది దేవతల బూజించ నారంభించిరి.

పైసిద్ధాంతముల ప్రచారముచే బౌద్ధమతము క్షీణించెను. ఈ బౌద్ధమతము హిందూదేశములో క్షీణించినను జావా, బోర్నియో, మలయా, బర్మా, సయాం, చైనా, జపాన్ మొదలగు వివిధ దేశములలో విజృంభించెను. ఈ రెండుమతములు రాజ్యపరిపాలకుల సహాయమున విజృంభింపగలిగినను హిందూ మతమును మాత్రము క్షీణింపజేయలేకపోయినవి. ఈ రెండు మతములే కాదు, వీని యుద్ధతి మారినపిదప మహమ్మదీయులు హిందూదేశముమీదకు దండయాత్రలు జేసి, హిందూదేవాలయములు విధ్వంసము చేసిరి. ఒకచేత 'ఖొరాను' వేరొకచేత ఖడ్గము పట్టుకొని యీ రెండింటిలో మీ కేది కావలెనని ప్రజలను భయపెట్టి మహమ్మదీయమతవ్యాప్తి జేసిరి. వీరు రమారమి 800 సం॥రములు హిందూదేశపుపాలకులుగా నుండి తమమత మును పెంపొందింప పాటుపడిరి. కాని అనాదినుండి హిందూ

మతము నశించిపోలేదు. పిదప ఆంగ్లేయుల పరిపాలనము వచ్చినది. వీ రాధునికమార్గములలో మతప్రచారము గావించిరి. క్రైస్తవమతప్రబోధము రాజాదరణక్రింద విరివిగా హిందూదేశములో సాగినది. కాని హిందూమతము నశించిపోలేదు. పిదప బ్రహ్మసమాజాదులు వర్ధిల్లినవి. అవికూడ హిందూమతమును క్షీణింపజేయలేకపోయినవి. అందుచే హిందూదేశము–హిందూమతము–యుగయుగములనుండియు క్షయములేక వర్ధిల్లుచునే యున్నవి. ఇవి మతములనుగూర్చిన విషయములు.

---

## చారిత్రక విషయములు

ఇక చారిత్రకవిషయములను పరిశీలించి చూతము. అలగ్జాండరు క్రీ. పూ. 326 సం॥ హిందూదేశముపై దండయాత్ర చేసి పురుషోత్తముని నోడించి తనరాజ్యమును స్థాపించుకొనెను. అయితే ఆనాటి గ్రీసుదేశపువిజ్ఞానమును హిందువులు అలవఱచుకొనిరే కాని వారిమతమును మార్చుకొనలేదు. సస్యశ్యామలమై భాగ్యవంతమై హిందూదేశము వర్ధిల్లుటే పరరాజుల దండయాత్రలకు కారణము.

పిదప శాక్తేయులు, కుషాణులును దేశములోనికి దండయాత్రలు జేసిరి. పిదప గుజరులు వచ్చిరి. వారిపేరే పెట్టిన గుజరాతులో ప్రవేశించి ఉత్తరహిందూస్థానములో గుజరా

...తీయు లను పేరుతో నాగరికశ్యాములుగా నివసించుచుండిరి. వీరి పిదప హూణులు వచ్చిరి. వీరు బౌద్ధదేవాలయాదుల ధ్వంసము జేసి బౌద్ధమతమునకు తీరని అపకారము జేసిరి. అప్పటినుండియు బౌద్ధమతము హిందూదేశములో పూర్తిగా క్షీణదశకు వచ్చెను. వీరిపిదప కొన్నివందల సం॥రములవఱకును హిందూదేశము మీద కెవ్వరును దండెత్తి రాలేదు. క్రీ. వె. 712 సం॥రములో "మహమ్మదుబిన్‌ఖాసీమ్" సింధుదేశముమీదకు సైన్యములు తరలించుకొని పోయి ఆ దేశమును జయించెను. కాని దండయాత్రచే సింధుదేశములో నేవిధమైనమార్పును రాలేదు. పిదప 11వ శతాబ్దములో మహమ్మదుగజనీ హిందూదేశముమీదకు చాలసార్లు దండయాత్ర జరిపెను. ఇతడే యమునానదిపైనున్న మధురాపట్టణమును, గుజరాత్‌లోనున్న సోమనాధదేవాలయమును కొల్లగొట్టుకొని పోయెను. వీనిపిదప మహమ్మదుగోరీ దండయాత్రకు వచ్చి పృథ్వీరాజును క్రీ. వె. 1191 సం॥రములో యుద్ధములో నోడించెను. అట్లు దండయాత్రను గొనివచ్చిన మహమ్మదీయ సైన్యములు హిందూదేశములో కాపురముండి పోయినవి. అప్పటినుండియు హిందూదేశము మహమ్మదీయులకు స్థావరమైపోయినది.

హిందూమతమునకు పునాదియైన వర్ణవివక్షత హిందూదేశమందు సర్వకాలసర్వావస్థలయందును పాటింపబడుచునే యున్నది. చాతుర్వర్ణములవారును సాధారణముగ నెట్టినో

వికారములను పొందక తాము నమ్మినమతమును మార్చుకొనకుండ కాలక్షేపము చేయుచునేయుండిరి. కాని వీరిలో పంచములుమాత్రము విశేషపరిజ్ఞానము లేకపోవుటచేకాబోలు అన్యమత స్వీకరణము వీలైనప్పుడెల్ల చేయుచునేవచ్చిరి. వీరిలో చాలమంది మొగలు మహమ్మదీయుల బలవంతమునకు లోనై హిందూమతమును పరిత్యజించి మహమ్మదీయమతమును స్వీకరించిరి. అందుచే హిందూదేశములో మహమ్మదీయమతస్థుల సంఖ్య పెరిగినది. కాని ఈ మహమ్మదీయు లందఱు టర్కీ, పర్షియాలనుండి దిగుమతియైనవారు కారు. వీరిట్లు మతమును మార్చుకొనుటకు కారణము లనేకము లుండవచ్చును. (1) పంచములయెడ హిందువుల నిరాదరణ; (2) అన్యమతావలంబకులు చూపించు సాంఘిక, ఆర్థిక, రాజకీయ, అభ్యున్నతికి మార్గములు; (3) ఏవిధమైన మతమునందునను వారికి సహజముగ నభినివేశము లేకపోవుట మొదలగు కారణములు పెక్కు లుండియుండవచ్చును.

ఇట్లు దేశములో మహమ్మదీయమతావలంబకులు పెరుగుచున్నకొలది, దేశములోనికి మహమ్మదీయులు ప్రవేశించి ఢిల్లీని ముఖ్యపట్టణముగా చేసికొని రాజ్యపరిపాలనము సాగించుచొచ్చిరి. కుతుబుద్దీన్, అల్తమష్, సుల్తానారిజియా మొదలగు బానిసప్రభువులును, పిదప బేబరు, హుమయూన్, అక్బరు మొదలగు మొగలాయిచక్రవర్తులును ఈ దేశమును పరిపాలిం

చిరి. ఈ మొగలాయీ ప్రభువులవలన, మహమ్మదీయులవలన విశేషశాసనము లేకపోవుటచే మహమ్మదీయమతము విజృంభించుట మాన లేదు. పిదప అక్బరు మహమ్మదీయమతవ్యాప్తికి కంకణము కట్టుకొని హిందూమతస్థులైన రాజపుత్రులను విశేషముగా బాధపెట్టుట ప్రారంభించినాడు. అనేక యుద్ధములలో ఓడిపోయి పారిపోవుటకు గూడ పీనిక సంభవించినది. కాని అక్బరు పట్టుదలనుమాత్రము మాన లేదు. హిందువులను బాధించినంతకాలము తనరాజ్యములో శాంతి యుండదను విషయము తనకు పడుచుతనము దాటినపిదపగాని గ్రహించుకొన లేదు. పిమ్మట హిందువులతో సఖ్యము చేసికొని సర్వమతసహిష్ణుతను ప్రకటించెను. అట్లు ప్రవర్తించిన నాటనుండియే దేశములో శాంతి యేర్పడినది. అప్పటినుండియే మొగలాయీచక్రవర్తులు గుండెలపై చేయివైచుకొని సుఖముగ రాజ్యపాలనము చేయదొడగిరి. ఢిల్లీలోని జుమ్మామసీదు, ఆగ్రాలోని తాజ్ మహాల్ వెలసినవి. ఈ మహమ్మదీయయుగములో నే–శాంతముగానుండి హృదయవైశాల్యముతో అన్యమతసహనము గలిగి రాజ్యపరిపాలనము చేసినంతకాలము మొగలాయీలు భారతదేశమును చక్కగ పరిపాలించిరి.

పిదప ఔరంగజేబు పాలనము వచ్చినది. ఇతనికి మతావేశము మెండు. మహమ్మదీయమతావేశము మెండగుటచే ఖడ్గమును, ఖోరానును చేతిలో బట్టుకొని మహమ్మదీయ

మతమును వ్యాప్తి గావించవలెనని విశ్వప్రయత్నము చేసినాడు. ఇది మహారాష్ట్రులు, ఆంధ్రులు సహించలేకపోయిరి. వివిధ రాష్ట్రములలో క్రమక్రమముగా తిరుగుబాటులు పెచ్చుపెరుగుచువచ్చినవి. మహారాష్ట్రులు తమనాయకుడైన శివాజీ బాపుట క్రింద నడచి మహమ్మదీయుల నోడించుటకు ప్రయత్నముల జేసిరి. ఔరంగజేబు తొంబదిసంవత్సరములు బ్రతికి రాజ్యమును కాపాడుకొనుచు వచ్చినాడు. కాని, వానితర్వాత వచ్చిన మొగలాయి రాజులు బహునీరసులై, సుఖాపేక్షులై రాజ్యమును పోగొట్టుకొనిరి. ఇది పోవుచుండగా నాదర్షా దండయాత్ర చేసి దేశమును కొల్లగొట్టుకొని పోయెను. కాని ప్రత్యేకించి రాజ్యస్థాపనము చేసికొనలేకపోయెను.

---

## ఆంగ్లేయులు-హిందూదేశ ఆక్రమణ

ఈలోపనే ఆంగ్లేయులు హిందూదేశమును క్రమక్రమముగా నాక్రమించుకొని రాజ్యమును సంపాదించుకొన ప్రారంభించిరి. వీరు మొదట హిందూదేశమునుగూర్చి ఏవిధమైన ప్రసక్తిని యెత్తియుండలేదు. మరియు క్రైస్తవమతవ్యాప్తి బాధ్యత తమపై బెట్టుకొనలేదు. అమెరికాలోని క్రైస్తవమత సంఘములవారి కీవిషయమై వదలివేసి వారికి ప్రచ్ఛన్నముగా సాయము చేయుచువచ్చిరి. ఈనాటివఱకు క్రైస్తవమతములో

కలసిన హిందువులలో నూటికి తొంబదిమంది పంచములే కాని చాతుర్వర్ణములలోనివారు కారు.

ఈవిధముగా ఆంగ్లేయులు దేశము నాక్రమించుకొనుచు రాజ్యపరిపాలనము చేయబూనిరి. వారితోబాటు క్రైస్తవమతము దేశములో ప్రబలము కాజొచ్చినది. కాని వేఱొకప్రక్కనుండి మహమ్మదీయులను, క్రైస్తవులను పాఱద్రోలి హిందూమహాసామ్రాజ్యమును స్థాపించవలెనని మహారాష్ట్రులు పెద్దసైన్యముల సమకూర్చుకొని, ఉత్తరమున బంగాళాదేశము, పాటలీపుత్రము, పంజాబువఱకును గల భూభాగమును ఆక్రమించుకొనిరి. దక్షిణమున తిరువాన్కూరువఱకును గల రాజ్యమును గెలుచుకొనిరి. తూర్పున బంగాళాఖాతమువఱకును ఆక్రమించుకొనిరి. ఈ హద్దులమధ్య గల భూభాగమును మహారాష్ట్రులు గెల్చి హిందూసామ్రాజ్యమును స్థాపింప నెంచిరి. బాలాజీరావు, బాజీరావు, బాలాజీబాజీరావు, నానాఫడ్నవీసు మొదలగు మహారాష్ట్రయోధులు, అనేకయుద్ధములలో స్వయముగా సైన్యముల నడపి యుద్ధముల గెల్చి తమరాజ్యవిస్తీర్ణమునకై విశేషప్రయత్నములను జేసిరి. ఉత్తరమునగల మొగలాయిచక్రవర్తుల యధికారము క్షీణించినకొలదియు మహారాష్ట్రవిజృంభణము పెరుగజొచ్చినది. ఉత్తరహిందూస్థాన మంతయు నాక్రమించుకొని ఒకపతాకముక్రింద కీరాజ్యభాగ మంతయు తీసికొనివచ్చుటకు విశేషశ్రమ పడవలసి...

లేకుండనే మహారాష్ట్రులకు నశించిపోయినది. మహారాష్ట్రులు గెల్చుకొనిన రాజ్యభాగ మంతయు తమయధీనమునం దుంచు కొని పాలించుటకు సరిపడు సైన్యములు లేకపోవుటచేతను, అప్పటికి దేశములోనున్న ఇతరసంస్థానాధీశ్వరులకు హిందూ మహాసామ్రాజ్యస్థాపనాదర్శము లేకపోవుటచే వారు తగిన సహాయసంపత్తి మహారాష్ట్రుల కొసగకపోవుటచేతను, మహా రాష్ట్రదేశములో సరియైన నాయకులు లేకపోవుటయేగాక, సైనికులలో నైక్యత లేకపోవుటచేతను ఈమహారాష్ట్రులు సామ్రాజ్యస్థాపనము చేయలేకపోయిరి. మహారాష్ట్రులు విజృం భించుటయు క్షీణించుటయుకూడ నొకశతాబ్దిలోనే జరిగి పోయినది.

వీరిక్షీణతయే ఆంగ్లేయపాలనమునకు చేయూత నొసంగి నది. ఆంగ్లేయులు హిందూదేశములోనికి మొదట వర్తకవ్యాపా రమునకై అడుగు పెట్టిరి. క్రమక్రమముగా వర్తకమును విజృం భింపజేసిరి. ఈ వాణిజ్యవుసరుకు నిలవకై కోటల కట్టుకొనిరి. వీని కావలాకై చిన్నచిన్న సైన్యముల దెచ్చుకొనిరి. ఈ తెచ్చు కొనిన సైన్యముతో యీకోటలను కాపాడుకొనుచు వ్యాపా రము విరివిగా జేసుకొనుచు చుట్టుప్రక్కలగల చిన్నచిన్న రాజుల వివాదములలో జోక్యములు కలుగజేసుకొని ఒకరి యండను జేరి వేఱొక్కరిని ఓడించుచు తుదకు ఆరెండురాజ్య ములను లోగొనుచు తాము రాజ్యసంపాదనకు గడంగిరి. అను

రికాలో నింగ్లీషువారు సంపాదించుకొన్న రాజ్యములోని ప్రజలు ప్రభుత్వముతో విడివడి స్వతంత్రమును ప్రకటించు కొనిరి. అప్పటినుండి ఆంగ్లేయులకు వలసరాజ్యములు లేక పోవుటచేతను హిందూదేశములో నాయన్న చక్రవర్తి, యేక చ్ఛత్రాధిపత్యముతో పరిపాలించువాడు లేకపోవుటచేతను ఇచ్చట బ్రిటిషువారు రాజ్యసంపాదనమునకు పూనుకొనిరి.

అర్ధశతాబ్దములో విశేషభూభాగమును ఆర్జించుకొని రాజ్యపరిపాలనమునకు దొడంగిరి. ఈ పరిపాలనావిధానములో నొక చిత్రము లేకపోలేదు. రాజ్యాధిపాలనమును నిలువబెట్టు కొనుటకై సైన్యములను, ప్రజాక్షేమమును కనిపెట్టి చూచుటకు పోలీసుదళమును, రాజ్యమును మండలములుగ విభజించి పన్నులు మొదలగునవి వసూలుచేసి అచ్చట శాంతిభద్రతలను కనిపెట్టి చూచుటకు కలక్టర్లను, ప్రజలలో నొకరికొకరికి వచ్చు వివాదములను పరిష్కరించుటకై కోర్టులను, ఈ కోర్టులలో సక్రమపద్ధతిని కార్యాచరణమునకు గడంగుటకు చట్టములను నిర్మించుచు రాజ్యపరిపాలనావిధానమును పెంపొందించుకొన సాగిరి. కాని యీ రాజ్యసంపాదనమునుగూర్చి పెక్కండ్రాం గ్లేయులు వివిధాభిప్రాయములు గలిగియుండిరి.

వాణిజ్యమునకై వచ్చిన యాంగ్లేయులు యీ రాజ్య సంపాదనవిషయములో నంగీకరించియుండలేదు. మెట్కాఫ్ దొర ఈ రాజ్యమునుగూర్చి "ప్రమాదకరమైనదే" యని భయ

పలుచుండెడివాడు. "హిందూదేశములోని మన (బ్రిటిషు) రాజ్యపరిపాలనము చిరస్థాయి కాజాల దనువిషయము ధర్మమైన వాదమే కాని, యీర్ష్యాసూయలతో ననుచున్న మాట కాదు" అని మెల్ఫిన్‌స్టన్ నిర్మొగమాటముగా పేర్కొని యున్నాడు. "హిందూదేశమువంటి రాజ్యములో మన మెప్పుడును ప్రమాదస్థితిలోనే యుంటిమి" అని మాల్కాము వ్రాసియున్నాడు.

"ఈ రాజ్యపాలనమను దుర్గుణము మనలోనే కలదు" అని మన్రో వ్రాసియున్నాడు. రాజ్యపరిపాలనావిధానమును తెలిసియున్న యే రాజకీయవేత్తయు యీసామ్రాజ్యసంపాదనమునకు సంతోషించియుండలేదు. "విశాలమైన యీదేశములో సైన్యమువలన ప్రజలను అధికారానువర్తులుగ జేయుట కష్టమనియు, సైన్యము సుశిక్షితముగా నున్నను ప్రజలలో ప్రభువిశ్వాసమును పోగొట్టుకొని తిరుగుబాటు చేసినయెడల సామ్రాజ్యమును నిలువబెట్టుకొనుట కష్టమనియు, మన రాజ్యమునకు దేశమునకు ఆఱువేలమైళ్ళ దూరములోనున్న హిందూదేశములో దుర్మరణముపాలగుట మంచిది కాదు" అని యెల్ఫిన్‌స్టన్ వ్రాసియున్నాడు. "శత్రువిజృంభణము గాని, ప్రజలలో తిరుగుబాటు గాని బ్రిటిషుపరిపాలనావిధానమును ఒకకడకు తీసుకొనిరాకపోయినచో చిట్టచివరకు హిందువులలోని మతావేశమైన ప్రజలను రెచ్చగొట్టి ప్రభుత్వముమీదకు తప్పక

పెరుగుబాటు తీసుకొనవచ్చును" అని యింగ్లాండులోని రాజకీయ వేత్తలందఱు నిశ్చితాభిప్రాయులైరి. అందుచే రాజకీయ నీతిజ్ఞులు బహునిపుణముగ రాజ్యపాలనావిధానమును [illegible] కొన్ని కొన్ని సక్రమమైన చట్టములను, శాసనములను అమలులో పెట్టి రాజ్యపాలనావిధానములో కట్టుదిట్టములు చేసి కొనిరి. రాజ్యపాలనమునకు ముఖ్యమైన శాంతిభద్రతలను నెలకొల్పుకొనుటకు సిండాగీలను, ఠగ్గులను పట్టుకొని బంధించి దేశములో శాంతిని నెలకొల్పెను. ప్రజలనుండి పన్నులు వసూలు చేయుటకు భూమిని కొల్చి సరిగా పన్నులు కట్టి, యీపన్నులు వసూలుచేయుటకు కలక్టర్లను యేర్పాటు చేసి, వారికి కావలసిన సిబ్బందిని, అధికారములను యిచ్చుచు వచ్చిరి. ఇందులకు కారణము ఢిల్లీప్రభుత్వము అమలులో నున్నప్పుడు యీపన్నులు వసూలుచేయు ప్రతియుద్యోగికిని పెద్దపెద్ద సిబ్బందిని యిచ్చి పంపించినగాని దారిలో దొంగలు, దోపిడిగాండ్రు వీరిని అటకాయించి, యీడబ్బు లాగుకొని, ఉద్యోగులను చంపి పోవుచుండెడివారు. అందుచే బ్రిటిషుప్రభుత్వము వారు ఈపన్నులు వసూలుచేయు కలక్టర్లకు సర్వాధికారములను చేతిలో బెట్టి రాజ్యపాలనావిధానమును సాగించిరి. కాని ప్రభుత్వ మెన్ని జాగ్రత్తగలపద్ధతులు యేర్పాటు చేసినను యీపదవులతాలూకు ఉద్యోగులు లంచగొండులై ప్రజలను పలువిధములుగా బాధలు పెట్టిరి. న్యాయస్థానములలోని

తీర్పులు లంచమిచ్చిన డబ్బునుబట్టి విలువ కట్టబడుచుండెడివి. పోలీసులు ప్రజలను సంరక్షించుటకుబదులు కష్టపెట్టుచుండెడివారనియు, దొంగతనము మొదలగునవి యేనాడును పోలీసు దర్యాప్తు చేసి న్యాయమును సమకూర్చకుండిరనియు, తుదకు దొంగలే పోలీసువారిమీద దయదలచి యీ కేసు మీరు దర్యాప్తు చేయించి మాలో నెవ్వరినో ఒక్కరిని పట్టి వప్పగించండి అని కోరితే వారికోరిక ప్రకారం దర్యాప్తు చేసినట్లు నటించి యెవరినో ఒకరిని పట్టి వప్పగించెడివారట. ఇట్టిదారుణములనేకములు పోలీసువారు చేయుచుండెడివారని విలియం బెంటిక్ వ్రాసియున్నాడు. లంచగొండితనము, చిత్రవధ చేయుట కూడ పోలీసువారిపని యని బెంటిక్ వ్రాసియున్నాడు. ఇంతేకాక యీపోలీసువారి దారుణములు మొగలాయీప్రభుత్వములో కంటె బ్రిటిష్‌పరిపాలనములో నెక్కుడుగా నున్నవనికూడ బెంటిక్కు వ్రాయకపోలేదు. అందుచే బెంటిక్కుతర్వాత గవర్నరుజనరలుగా వచ్చిన కారన్‌వాలీస 1793 సం॥లో మొదటిచట్టమును రచించినాడు.

పిమ్మట మెకాలేదొర 1834 సం॥ములో ఇండియన్ పీనల్ కోడ్ ప్రారంభించి దానిని 1860 లో పూర్తి చేసి అమలులో పెట్టించెను. కాని యీచట్టము 1882 లోగా పూర్తికాలేదనియే చెప్పవచ్చును. ఈచట్టములోని శిక్షానిబంధనలు అతి దారుణములుగ నున్నవని లోక మంగీకరించినది. ఒకే నేరము

నది. అమెరికా దేశములోను ఇంగ్లండు దేశములోను ఇండియా దేశములోను శిక్షలు బహువిధములుగా విధింపబడినవి. అమెరికా యింగ్లాండు దేశములలోని శిక్షకును ఇండియాలోని శిక్షా నిబంధనములకును రెట్టింపు తేడా కలదు. ఒకే నేరమునకు అమెరికాలో నెలదినములు శిక్షయైన ఇండియాలో అదే నేరమునకు 6 మాసములు శిక్ష, వేయిరూపాయలు జరిమానా విధింపబడినవి. శిక్షాస్మృతి యింతతీవ్రముగా నున్నదేమని మెకాలేను ప్రశ్నింపగా హిందూ దేశములోని ప్రజలకు ప్రభుత్వముపై నెక్కుడు భయభక్తులు గలిగినగాని రాజ్యపాలనము చేయుట మిక్కిలి దుర్ఘటము. అందులోను 6000 మైళ్ల దూరమునుండి యీప్రభుత్వవిధానమును సాగించుట కెంతేని అధికారము చేతిలో నుండవలె నని సమాధానము చెప్పెను.

ఇట్టి శిక్షానిబంధనలతో ఆంగ్లేయప్రభుత్వము హిందూ దేశముపై అధికారమును చేయుట ప్రారంభించినది. ఈ అధికారమునకు అంతు లేదు. వీరు ధనార్జనమే ప్రధానముగా పెట్టుకొని దేశములోని వెండి బంగారముల నెల్ల పీల్చివేసిరి. తలకుమించిన పన్నులతో ప్రజలు పీడింపబడిరి. ప్రజలలో అశాంతి బయలుదేరినది.

దేశములో పలుతావుల కాటకములు ప్రబలినవి. ప్రజలకు తిన తిండి లేక అలమట పడజొచ్చిరి. ఢక్కా ప్రాంతములలోని చేనేతపనివాండ్ర వ్రేళుల త్రెగగొట్టి యీ దేశమునకు

తీసి అపకారము చేసిరి. అప్పటినుండియు నీ దేశములో మాంచెస్టరు మిల్లులు పోయినవి. సన్నబట్టకై మాంచెస్టరు లాంకషైరు పైకి దృష్టి నిగిడ్చి, అక్కడనుండి సరకు దిగుమతి చేయించు కొని యింగ్లాండును అక్కడివర్తకులను ధనవంతులుగ జేసెను.

ఇంతేకాదు. దేశములో కరవులతోబాటు అంటువ్యాధులు ప్రబలినవి. విదేశీప్రభుత్వము దేశీయవైద్యమును పునరుద్ధరించుట మాని విదేశములనుండి మందులను యీ దేశములోనికి దిగుమతి జేసి ధన మార్జింపజొచ్చినది. ఇందుచే దేశీయ వైద్యము నశించిపోవుటచే వైద్యవృత్తి నశించిపోయినది. ఇది నశించుటకాదు; ప్రజలకుగూడ నిందుపై విశ్వాసముపోయినది. ఇట్లే దేశమున ననేకకష్టనష్టములు పెచ్చుపెరగజొచ్చినవి.

ఇంతలో 1914 సం॥రములో మొదటిప్రపంచయుద్ధము వచ్చినది. అందులో బ్రిటిషువారు గెల్చినప్పటికి వారికి విశేషలాభ మేమియు లేకపోయినది. దేశములో ప్రజలయందు స్వతంత్రేచ్ఛ ప్రబలుటచే 1905 సం॥రమునుండియు ప్రబలిన "వందేమాతరం" పేర జాతీయసంరంభము పెరిగి పెద్దది యైనది. పిదప హోంరూలు లీగు వచ్చి విజృంభించినది. ఆపై గాంధీగారి సత్యాగ్రహోద్యమము రేకెత్తినది. కాంగ్రెస్సు ప్రభుత్వమునకు వ్యతిరేకప్రచారము తీవ్రముగా చేయసాగినది. జాతీయసంస్థలు, విదేశవస్తుబహిష్కరణము, సహాయనిరాకరణోద్యమము, నానారూపముల దాల్చినవి. అప్పటినుండి ప్రభు

త్వము యీజాతీయసంస్థయైన కాంగ్రెస్సును ఒకకంట కనిపెట్టు చునే యుండిరి. ప్రభుత్వముపై ప్రజలలో అసంతృప్తి బయలు దేరిన దనుసంగతి ప్రభుత్వము గుర్తించుకొనకపోలేదు. అందుచే ప్రజలలో కొంత సంతృప్తి కలుగవలెనని మాంటేగు ఛెలంస్ ఫర్డు సూచించిన సంస్కరణముల నొసంగి ప్రజలను ఊకొట్ట వలెనని ప్రభుత్వము ప్రయత్నించిరి. కాని యీసంస్కరణలు కాంగ్రెస్సునకు, ప్రజాబాహుళ్యమునకును అంగీకారము కాలేదు. అందుచే గాంధీమహాత్ముడు తన సహాయనిరాకర ణోద్యమమును తీవ్రరూపములోనికి మార్చి ఉప్పుసత్యాగ్రహ మును ప్రారంభించి లక్షలాదిప్రజలను కారాగారమునకు పంపెను. ప్రభుత్వము తిరిగి ప్రజానీకమును జూచెను. ఏవిధ ముననైన ప్రజలలోని అశాంతిని తగ్గించవలెనని ప్రయత్నించిరి. గాంధీని పిలిపించి వారితో మంతనములు ప్రారంభించిరి. ఈవిష యమును మహామ్మదీయులు గమనించుచునేయుండిరి. గాంధీ మహాత్ముని సత్యాగ్రహోద్యమము తీవ్రతరరూపమును దాల్చిన ప్రభుత్వము భారతదేశమును కాంగ్రెస్సుఅధీనమును చేసి వారు వారిదేశమునకు వెడలిపోయినచో భారతదేశము హిందువుల పరిపాలనకు లోబడిపోవును గాని లోగడ చక్రవర్తులై అఖండ భోగముల ననుభవించిన మహామ్మదీయులకు రాజ్యపరిపాలనా బాధ్యత యుండదని, హిందువులలోనుండి విడివడి ప్రత్యేక మహామ్మదీయ రాజ్యమును స్థాపించవలెనని కృతనిశ్చయు లైరి.

జిన్నా గారిని వారికి నాయకునిగా నెన్నుకొనిరి. వారి యాజమాన్యమున మహమ్మదీయులు పోరాటమును సాగించిరి. 1930 సం॥లో సర్ మహమ్మద్ ఇక్బల్ ఆధ్వర్యమున జరిగిన లక్నో మహాసభలో మహమ్మదీయులకు ప్రత్యేకభూభాగమును హిందూదేశమునుండి విభజించి యీయవలె నను భావమును సూచించిరి. ఈ అభిప్రాయమునకె రహమత్ ఆలీ M. A. L. L. B. గా రొక నామధేయ మొసంగిరి. అదే 'పాకీస్థానం'. హిందూ దేశములోని మహమ్మదీయభాగమునకు పాకీస్థాన మని నామ కరణ మొసంగి ప్రచారమును చేయప్రారంభించినప్పటినుండియు మహమ్మదీయులు యీపాకీస్థానమును సంపాదించుకొన ప్రయ త్నములు చేయదొడగిరి.

---

## హిందూదేశముపై మహమ్మదీయుల దండయాత్రలు

కాని యీ ప్రత్యేకమహమ్మదీయరాజ్యముచే తిరిగి హిందూదేశమునకు మహమ్మదీయులవలన ముప్పు రావచ్చు నని హిందువు లపోహపడుటలో నాశ్చర్య మేమున్నది ? ఈది గువ చరిత్రాంశములు యీవిషయమును నిరూఢము చేయు చున్నవి. ఈక్రింద పేర్కొన్న వారందఱు మహమ్మదీయరాజ్య స్థాపనకై కృషి చేసినవారే.

1. మహమ్మద్ బీన్‌ఖాసీం క్రీ. శ. 711—సింధుదేశమును జయించి 9వ శతాబ్దములో వెడలిపోయెను.

2. మహమ్మద్ ఘజనీ క్రీ. శ. 1001—ఇతడు 17 పర్యాయములు దండయాత్రలు చేసెను 1030 లో చనిపోయెను.

3. మహమ్మద్ ఘోరీ క్రీ. శ. 1173—ఇతడు 1206సం॥ లో చనిపోయెను.

4. చెంఘీజ్‌ఖాన్ క్రీ. శ. 1221—హిందూదేశమును కొల్లగొట్టుకొన వచ్చెను.

5. ఇతని రెండవదండయాత్ర క్రీ శ. 1241—లాహోర్ ముట్టడి.

6. తైమూరు క్రీ. శ. 1398—ఇతడనేక దారుణహత్యలకు పాల్పడినాడు.

7. బాబర్ క్రీ. శ. 1526—ఇతనే మొగలాయిసామ్రాజ్యమును స్థాపించెను.

8. నాదర్‌షా క్రీ. శ. 1738—ఇతని దండయాత్ర అన్నిటిలోను తీవ్రతరమైనది.

9. అహమ్మద్‌షా అబ్దాలీ క్రీ. శ. 1761—పానిపట్టు యుద్ధములో మహారాష్ట్రుల గెల్చెను.

ఈదండయాత్రలలోని ముఖ్యాంశములగూర్చి చరిత్రకారు లీరీతిని రచించియున్నారు.

(1) మహమ్మద్ బీన్‌ఖాసీం : ఇతని దండయాత్ర.

సింధు దేశములోని రేవుపట్టణమైన దేబుల్ అనుచోట అరేబియా దేశస్థుల ఓడ నొకటి ఆపివేసినందులకు అక్కడి రాజైన రాజాదహీల్ యొక్క మేనల్లుని, అతని సైనికులను, పట్టుకొని వారందఱను మహమ్మదీయమతములోనికి మార్చుట, అక్కడి దేవాలయములను మార్చి మసీదుల కట్టుట, ఖురానును చదివి ప్రార్థనలను సల్పుట, ప్రతియుదయమున, సాయంకాలమున నమాజు సలుపుట మొదలగు పనులను చేయించెను.

(2) మహమ్మద్ ఘజనీ: ఇతని దండయాత్ర.

ఇతను దేవాలయముల నాశనముచేసి మసీదుల కట్టించెను. పట్టణముల పట్టుకొని విగ్రహారాధకుల జంపి మహమ్మదీయుల సంతుష్టి పఱచెను. పిదప తన దేశమున కేగి అచట మహమ్మదీయమతోద్ధరణమునకై చేసిన మేళ్లన్నియు వ్రేసిన ప్రారంభించి ప్రతిసంవత్సరము హిందూదేశముమీదకు మత సంబంధమైన పవిత్రయుద్ధమును జేయుటకై ప్రమాణము చేసుకొనెను.

(3) మహమ్మద్ ఘోరీ: ఇతని దండయాత్ర.

మతద్రోహులైన హిందువులను పైగంబరువారి ఆజ్ఞా ప్రకారము నశింపజేయుటకును, హిందూదేవాలయములు పడగొట్టి మసీదులు కట్టించుటకును, మహమ్మదీయమతమును విజృంభింపజేయుటకును సంకల్పించి ఇతను తన దండయాత్రలను ప్రారంభించెను.

ఈ పై ఆశయములతో మహమ్మదీయులు హిందూ దేశముపైకి విజృంభించి దండయాత్రలను సాగించిరి. ఏరిలో మహమ్మద్ బిన్ ఖాసీం మరీదారుణములు చేయించెను. "బ్రాహ్మణులకందఱకు బలవంతముగా మహమ్మదీయమతము నొసంగుచు 17 సం॥రములు పైబడినవారినెల్ల సంహరింపుచు, స్త్రీలను బాలురను బానిసలగా గొనిపోయెను. మఱియు హిందూ దేవాలయముల దోచుకొనెను. ఈదోపిడి సైనికులందఱు సమముగా పంచుకొనిరి. ఈమొత్తములోని 5 వ భాగము ఖాసీమున కీయబడెను" అని చరిత్రకారులు వ్రాసిరి.

ఈ ఖాసీంకంటె ఘజినీ తక్కువవాడు కాడు. ఏలయన "క్రీ. శ. 1001 సం॥రమున మహమ్మద్ ఘజినీ జయపాలు రాజును జయించి, ఆతనిని (జయపాలుని) తనముఖ్యపట్టణములో తలవంపులు గల్గునట్లు నడువీధులవెంట నడిపించెను. ఇట్లు చేయించుటచే హిందువులగుండెల్లో మహమ్మదీయమతమన్న భయము గాటముగా నాటుకొనిపోవుటకు చేయించెను" అని చరిత్రకారులు ఘజినీ దండయాత్రలగూర్చి వ్రాసిరి. ఒక్కొక్క దండయాత్రతో వేలకొలది దేవాలయములు నాశనమయ్యెను. వేలకొలది బ్రాహ్మణులు హతమారిరి. ఈ దారుణ హత్యలు ఎంతయెక్కువగ జరిపించిన అంత మహమ్మదీయ మతాభిలాషియట. డాక్టర్ టిటస్ వ్రాసిన చరిత్రనుబట్టి చూచిన మహమ్మదీయుల మొదటి దండయాత్రలలో చేసిన దారుణములు సంగ్రహముగ స్వీకిందిరీతిని పేర్కొనవచ్చును.

1. దేవాలయముల పడగొట్టి అందలి ధనముల దోచు కొనుట,

2. బ్రాహ్మణులను నిర్దాక్షిణ్యముగ జంపుచుట,

3. హిందువులను బలవంతముగ మహమ్మదీయమతము లోనికి మార్చుట,

4. సుల్తాను ఆజ్ఞలను శిరసావహింపనివారిని సజీవముగా దహించివైచుట,

5. విద్యాలయములను గ్రంథాలయములను తగుల బెట్టుట,

6. ప్రజలను బానిసలగా తమ దేశమునకు తీసుకొని పోవుట,

7. హిందువులకు జిజియా యను తలపన్ను విధించుట మొదలగు సర్వవిధములైన హింసామార్గముల నరసిరి.

మహమ్మదీయులు హిందూదేశమును శత్రుస్థానమని యు, హిందువులు ఆజన్మ విరోధులనియు, వారి మతప్రకారముగా హిందువులు కాఫరులు కాన, అట్టికాఫరులను వధించుట వారికి మతసేవచేయుట యనియు నెంచి, హిందువులు పాలితులుగాను, మహమ్మదీయులు పాలకులుగాను నుండవలసినదని విధిగాని వేఱొక్కటి కాదను నిశ్చితాభిప్రాయముతో మహమ్మదీయులు హిందూదేశములో నివసించిరి. మహమ్మదీయులు యీభావ ములనే యించుమించుగా నాటినుండి నేటివఱకును గలిగియుం డిరి. అందుచే మొగలాయీ రాజ్యపరిపాలనాంతరమున బ్రిటి

[illegible] ఆక్రమించుకొని పాలించియు హిందూదేశమును వదలిపెట్టి వెళ్లిపోవలసినకాలము వచ్చినప్పుడుకూడ, ఈ హిందూమహమ్మదీయసమస్యను యిట్లు మిగిల్చిపోయిరి; కాని ఏవిధముగాను పరిష్కారము కాలేదు. చేయలేక సరికదా యీ ద్విరాజ్యసమస్య (Two Nation Theory) ని బలపరచి హిందూదేశములో మహమ్మదీయులకు స్థావర మేర్పాటు చేసి వెడలిపోయిరి.

---

## మహమ్మదీయులు: ప్రత్యేకస్థానము.

1857 సం॥రములో బ్రిటిష్‌పరిపాలనక్రింద నున్న భారతదేశములో జాతీయోద్యమము తీవ్రరూపమును దాల్చినది. అది మహావిప్లవమై పరిణమించినది. సైనికుల తిరుగుబాటే యీ విప్లవశక్తి. ఈ దేశములోని బ్రిటిష్ప్రభుత్వము గజగజలాడిపోయినది. ప్రాణములు దక్కించుకొని బయట పడగల దినములు వచ్చునా యని తల్లడిల్లిపోయిరి. రక్తప్రవాహములు గంగానదిలో కలిసి ప్రవహించినవి. సహజముగా పిరికివారైన ఆంగ్లేయులు సైనికబలమునకై నిరీక్షించిరి. కాని ఆబలములోనే దుర్బలత వచ్చినది. అందుచే వారు చెల్లాచెదరై పారిపోయిరి. కాని హిందువులు ఏకకార్యార్థులై యేకనాయకత్వముక్రిందకు రాలేకపోయిరి. హిందువులలో నైకమత్యము రాకపోవుటచే ఆంగ్లేయులు తమతమపటాలములను తిరిగి సమ

కొన్నిచోట్ల ప్రసకవిప్లవమును అణగద్రొక్కిరి. ఝాన్సీలక్ష్మి బాయి, తాంతియాతోపి, నానాసాహేబ్ పీసు మొదలగు నాయకులను బందీగచేసుకొనిరి. కొందరిని వధించిరి. కొందరిని బజారులలోని చెట్లకు గట్టి ఉరిదీసిరి. మొత్తముమీద ఈ విప్లవోద్యమమును పూర్తిగ భంగముచేసుకొనిరి. పిదప చేసిన రాజ్యపాలనములో బ్రిటిషువారు ఒడుదుడుకులు లేకుండ దేశపాలనము సాగించిరి. అందుచే 1888 నుండి 1905 వరకును దేశములో శాంతి ప్రబలినది.

బ్రిటిషుప్రభుత్వమువారిచే స్థాపించబడిన ఆంగ్లేయవిద్యాలయములలో హిందువులు చదువసాగిరి. కాని మహమ్మదీయులు మాత్రము ఆంగ్లేయులు స్థాపించిన విద్యాలయములలో చదువుకొనకుండిరి. అందుచే హిందువులే యుద్యోగముల సంపాదించుకొనజొచ్చిరి. ఇది మహమ్మదీయులకు కష్టముగ నుండుటచే వారుకూడ నాంగ్లేయవిద్య నభ్యసింపవలెనని తెంచిరి. సర్ సయ్యద్ అహామద్ ఖాన్ యిది గుర్తించి ఆలిఘరులో నొక ప్రత్యేకవిద్యాలయమును మహమ్మదీయులకై స్థాపించెను. 1885 సం॥రములో స్థాపింపబడిన అఖిలభారతకాంగ్రెస్సులో హిందువులు అన్నిరాష్ట్రములలోనుండియు వచ్చి తమతమ కష్టములను ప్రభుత్వమునకు నివేదించుకొన ప్రారంభించిరి. మహమ్మదీయులుకూడ మంచి యాంగ్లేయభాషను నేర్చుకొనుటకై విద్యాధికుడైన 'మిస్టర్ బెక్' అను నాంగ్లేయుని ఆలిఘర్ కాలేజీకి

సర్వాధికారిగా (Principal) గా నియమించిరి. ఈవారు ఆలీ ఘర్ విద్యాలయమునకు యీ జమాన్యమును తీసికొనుటయే గాక మహమ్మదీయుల రాజ్యకార్యములలో ఐక్యమును కలుగ జేసుకొని వారికి కావలసిన సర్వవిషయములలో గూడ సహా కారిగ నుండుచుండెను. సర్ సయ్యద్ అహమ్మద్ ఖాన్ విద్యాలయమును నడిపించుటయేగాక మహమ్మదీయులను కాంగ్రెస్సులో జేరవలదని హితమును బోధించి వారిని వేరుగ ముగా నుంచెను. కొందఱు మహమ్మదీయులు కాంగ్రెస్సులో జేరకపోలేదు. కాని ఆలిఘర్ విద్యాలయము యింగ్లాండులోని రాజకీయవేత్తలతో సంబంధమును కలుగ జేసుకొనుచు హిందూ దేశములో మహమ్మదీయుల యభివృద్ధికై వలసిన యుద్యోగు లతో జేరి వారిసాహాయ్య మపేక్షించుచు వచ్చిరి. 'బెక్' ఆలి ఘర్ విద్యాలయమును విడిచిపెట్టి వెళ్లిపోయిన పిదప సర్ థియోడర్ మారిసన్ యీవిద్యాలయమునకు (Principal) సర్వాధికారిగా వచ్చెను. ఇతడుకూడ బెక్ నడచినమార్గము ననే నడువజొచ్చెను.

1905 సంవత్సరములో హిందూదేశమునకు వైస్రాయిగ లార్డు ఖర్జను వచ్చెను. ఈతడు బెంగాలులో మహమ్మదీయులు విస్తారముగ నివసించుచున్న భాగమును విడదీయవలెనని సంక ల్పించుకొనెను. బెంగాల్ రాష్ట్రము విస్తీర్ణములో నెక్కుడుగా నున్నదని చెప్పుచు రాష్ట్రమును విడదీయవలెనని సంకల్పించి

మహమ్మదీయు లెక్కు-వగనున్న భూభాగమును విడదీసెను. ఇందులకు దేశస్థులు వ్యతిరేకించిరి ఈవ్యతిరేకతకు ఒకరూపము నొసంగిరి. అదియే వంగదేశవిభజన లేక వందేమాతరవిప్లవము. ఈవిప్లవము దావాగ్నివలె విజృంభించినది. వంగదేశము, మద్రాసురాష్ట్రము, బొంబాయిరాష్ట్రము, మధ్యపరగణాలు మొదలగు వివిధరాష్ట్రములలో నీయుద్యమము విజృంభించినది. హిందూదేశమంతయు, నొకేసారి విజృంభించిన యీ వందేమాతరం ఉద్యమమునకు బ్రిటిషువారు భీతావహులైరి. ఈయుద్యమములో పిస్తోళ్లు, బాంబులు విరివిగా నుపయోగింపబడినవి. ఇందులో హతులైనవారు ఆంగ్లేయులే. అందుచే వారికి మనస్థైర్యము తగ్గజొచ్చినది. ఈఉద్యమము హిందువుల లోనే విజృంభించుచున్నదని ప్రభుత్వము తెలిసికొన్నది.

1905 సం॥రములో నవంబరు మాసమున లార్డు మింటో వైస్రాయిగ వచ్చెను. ఈతడు వచ్చిన కొలదిమాసములలోనే జాన్ మార్లేకు మింటో యిట్లు వ్రాసెను. "కాంగ్రెస్సువిషయములో............వారిని గుర్తించి.........వారిలో మంచివారితో మనము సానుభూతిని చూపింపవలసి యున్నది. కాని కాంగ్రెస్సులోమాత్రము రాజద్రోహము పొడసూపుచున్నది. కాబట్టి భవిష్యత్తులో ప్రమాదము సంభవింపవచ్చును. కాంగ్రెస్సువారి యెత్తులకు ప్రతికూలమైన యెత్తులు యెత్తవలెనని ప్రయత్నించుచున్నారు. రాజులసభ నొకదానిని

యేర్పాటు చేసిన ఒక్క రాజులనే కాదు మఱికొందఱు పెద్ద లను సంవత్సరమున కొక్కసారి వారముదినములో పదిహేను దినములో ఢిల్లిలో సమావేశపఱచి వారిసలహాల తీసికొనుచు రాజ్యపాలనమును సాగించుట మంచిదని తోచుచున్నది. కాని కాంగ్రెస్సువారి సలహాలలో మంచివిధానములు సూచింపబడు చుండుటచే నవికూడ త్రోసివేయుటకు వీలులేదు".

1906 సం॥రమున జూను నెలలో మింటో సైక్రటాయికి మార్లే యిట్లు వ్రాసెను. "దేశములో నూతనశక్తి విజృంభిం చుచున్నది. అందఱు మనలను హెచ్చరించుచున్నారు. లారెన్సు, మిరోలు, సిడ్నీలో మొదలగువారందఱు యీపాటనే పాడు చున్నారు. మీరు పాతపద్ధతులలోనే పరిపాలించుచుండుట మంచిది కాదు. కాంగ్రెస్సువారిని మీ రెట్లుభావించినను కాంగ్రెస్సుపక్షమువారి సలహాలను పుచ్చుకొని వారిసానుభూ తిని పొందుచుండవలెను. కొలదికాలములోనే మహామ్మదీ యులుకూడ కాంగ్రెస్సువారితో చేతులు కలిపెదరు" అని వ్రాసెను.

ఈ ఉద్యమము హిందువులలోనే విజృంభించుచున్నదని తెలుసుకొని ప్రభుత్వమువారు మహామ్మదీయులపైకి దృష్టిని ప్రసారించిరి. మహామ్మదీయులు నాడు ప్రభుత్వమున్న స్థితి గతులను తెలిసికొనిరి. అందుచే మహామ్మదీయులు లార్డు మింటోను 1906 సం॥ అక్టోబరు 6వ తారీఖున సిమ్లాలో సంద

ర్పించిరి. ఆసమావేశములోనికి మహమ్మదీయులైన నవాబులు, స్వతంత్రాధిపతులు, జమీందారులు, రాజకీయవేత్తలు మొదలగు మహామహులు వందలకొలదిగ విచ్చేసిరి. ఆసభలో తమ జాతి అభివృద్ధియు, ప్రాచీనసాంప్రదాయవిశిష్టతయు, ఎన్నికలలో తమకు రావలసిన స్థానములగూర్చియు, ప్రత్యేకవిశ్వవిద్యాలయములను గురించియు చెప్పుకొనిరి. ఇందులకు వైస్రాయి మహమ్మదీయుల విజ్ఞాపనలను విని వారికిట్లు సమాధానము లిచ్చెను.

"మా కీర్తి యాపద సమయములలో సహాయార్థము వచ్చిన మీ పూర్వులకు మా ప్రత్యేక అభివందనములు. 1782 లో వారన్‌హేస్టింగ్సున్ను, 1811 లో మాపూర్వీకులు లార్డుమింటోయును, 1885 లో మాప్రభుత్వమును, మీకు సర్వవిధసాహాయ్యములను జేసిరి. ఆలిఘర్ విశ్వవిద్యాలయమును స్థాపింపజేసి దానికి లార్డులిట్టన్‌ద్వార 1877 లో శంకుస్థాపన చేసెను. అప్పటినుండియు దానిని సర్వవిధముల పోషించుచుంటిమి. ఇక ముందుకూడ దానికి సాహాయ్యమును చేయగలము. ఎన్నికలలోని స్థానములకై మీకు సరియైన ప్రాతినిధ్యముకొఱకై ప్రయత్నించెదము. మాకు యీ అవసరసమయములో సాహాయ్యము చేయుచున్నందులకు మేము కృతజ్ఞులము" అని సమాధాన మిచ్చెను.

ఇది మహమ్మదీయులకు ఆశాజనకముగ నుండెను. అందుచేతనే బుఖాన్ అనువాడు యీసమాధానమును "మహా

హమ్మదీయుల కధికారప్రధానపట్టి" మని వ్రాసెను. హిందు వులలోనుండి మహమ్మదీయులను విడదీసి వారికి కావలసిన ప్రత్యేకసదుపాయముల జేయుటకు యిదియే ప్రారంభము. ఇక్కడినుండియే యీసంఘము (హిందూమహమ్మదీయ) చీలి పోయినది. ఈభేదభావమును కల్పించినవాడు లార్డు మింటో. ఈసభ జరిగిననాటి సాయంకాలమున లేడి మింటోకొకజాబు వచ్చినది. అం దిట్లున్నది. "ఈనాడు ఒక గొప్ప ఘనకార్యము జరిగినదని వ్రాయుచున్నాను. హిందూదేశమునకును, హిందూ దేశచరిత్రమునకును చాలా సంవత్సరములవఱకు సంబంధించి యుండు యీవిషయము రాజకీయవేతృత్వలక్షణమును విదూ షించుచున్నది. రాజద్రోహుల సంఘములో జేరకుండ 6 కోట్ల 20 లక్షల ప్రజలను (మహమ్మదీయులను) వెనుకకు లాగిన హంశము ముఖ్యమైనది." ఈవిషయమును లేడి మింటో తన డైరీలో వ్రాసినది.

ఈ మహమ్మదీయసమావేశమునుగూర్చి యింగ్లాండు లోను అక్కడి పత్రికలలోను చక్కని యభిప్రాయములు వర్థి ల్లుటకై ముందే యేర్పాటు లన్నియు గావింపబడినవి. ఇది యేర్పాటుకాబడినపిదపనే 1 అక్టోబరు 1906 సం॥రమున ఆసభ సమావేశపఱుపబడినది. ఈసభలో మింటో యిచ్చిన ఆశా జనకమైన సూచనలనుబట్టి 'అఖిలభారతముస్లింలీగు' డిసెం బరువ్యాసములో స్థాపింపబడినది. దీనివెనువెంటనే హిందూ

మహాసభను హిందువులందఱు కలిసి స్థాపించిరి. అందువే హిందువులకును, మహమ్మదీయులకును భేదాభిప్రాయములు వర్ధిల్లినవి. ఈభేదములను ఆంగ్లోయిండియనుద్యోగులు పెంచి పెద్దవానిని జేసిరి. సిమ్లాలోను, లండనులోను గల ప్రభుత్వాధికారులతో చెవులుకొఱికి యీద్వేషములను పెచ్చుపెరుగునట్లు చేయించిరి— అని రాంసే మాక్డనాల్డు తనగ్రంథములో వ్రాసెను.

దేశమందన్ని వైపుల వ్యాపించిన యీ వందేమాతరం సమస్య ప్రభుత్వమునకు కుదర్పరాని రాచపుండైనది. ఇన్ని రాష్ట్రములలోను ఒకేకారణముపై జరుగుచున్న యీ తీవ్ర ఆందోళనము నణచిపెట్టుటకు ప్రభుత్వము సంకల్పించుకొన్నది. అందుచే యింగ్లండునుండి జడ్జియైన రౌలట్టు అనువానిని రావించి వానిచే యీదేశములోని అలజడులయొక్క మూలకారణములను కనుగొని అవి నివారింపజేయగల ప్రణాళిక నొకదానిని సూచించవలసినదని ప్రభుత్వమువారు కోరిరి. అందుపై రౌలట్టు హిందూదేశమంతయు పర్యటించి, వివిధప్రదేశములనుండి సాక్ష్యములను, విషయములను సేకరించి, 1918 సం॥లో నొక రిపోర్టును రచించెను. ఆరిపోర్టులో అత నొకశాసనమును అమలులోనికి తీసుకొని రావలసియుండు నని సూచించెను. అదే 'రౌలట్టుఆక్టు'.

ఈరిపోర్టులోని సారాంశములు రెండు. ఈసంచలనమును కొనివచ్చినవారు హిందువు లొక్కరే యనియు, ఇం

దళితజాతులవారెవ్వరును కలియలేదనియు వ్రాయుచు, హిందువులతో గూడ అన్యవర్గములవారును యీయాందోళనములో జేరియుండలేదనియు, యీ రాజకీయాందోళనము ఒక్క బ్రాహ్మణజాతివల్లనే అన్ని రాష్ట్రములలోను విజృంభించినదనియు, బ్రాహ్మణులే యీ యుద్యమములో శిక్షార్హులనియు సూచించుచు, వివిధరాష్ట్రములలో విజృంభించిన యీ ఉద్యమనాయకులను పేర్కొనుచు, యిది "బ్రాహ్మణోద్యమ" మని నామకరణము జేసెను. ఇందులకై ఒక శిక్షాస్మృతిని సృష్టించెను. ఈ రౌలట్టు ఆక్టు దేశమునకు అరిష్టదాయకమని ప్రజలు ఆందోళనము జేయ ప్రారంభించిరి. ఇది లేవదీయుటలో ప్రథముడు మహాత్మాగాంధీ. ఈతని యాజమాన్యమున సత్యాగ్రహోద్యమము లేవదీయబడెను. ఈయుద్యమము మొదట 2-3-1919 సం॥లో బయలుదేరదీసెను. 6-3-1919 సం॥ తేదీ రౌలట్టుఆక్టు ప్రతికూలదినమని ప్రకటించి హిందువులందఱు ప్రమాణముల తీసికొనవలెనని వ్రాసెను. ఆప్రమాణపత్ర మిట్లున్నది. "భగవంతుని సాక్షిగా హిందువులము, మహమ్మదీయులము అయిన మేము ఉభయులము అన్యోన్యమైత్రితో సోదరులవలె మెలగుదుము, మాలో మాకు భేదబుద్ధులు లేకుండ ప్రవర్తింతుము, ఒకరికష్టముల వేఱొక్కరు పంచుకొనుచు అవి తొలగించుకొనుటకు ప్రయత్నించుచుందుము. మఱియు మేముభయులము మతసహనము గలిగి

సర్వ్తంవృధు మతసంబంధమైన కారణములలో ఒకరకొకరు వ్యతి రేకింపకుండ నుందుము. మతమను పేరుపెట్టి ఒకరినొకరు ద్వేషించి దౌర్జన్యమునకు పూనుకొనము— అని ప్రమాణము చేయుచున్నాము".

ఈ హిందూమహమ్మదీయసఖ్యతకొఱకై తొలిసారిగా ప్రయత్నించిన హిందూనాయకుడు ఒక్క మహాత్మాగాంధీయే.

రౌలట్టుఆక్టునకును యీ ప్రమాణస్వీకారమునకు సంబంధము లేదు. కాని గాంధిమహాత్ముడు హిందూమహమ్మదీయ సఖ్యతకై యీ ప్రమాణము చేయించుట బహుదూరదృష్టితో కూడియున్నది. పిదప యీ క్రింది విషయము ఆ విజ్ఞతను నిరూపించుచున్నది.

టర్కీదేశములోని మహమ్మదీయులు మొదటి ప్రపంచ యుద్ధానంతరము రాజును త్రోసివేసి ప్రజాపరిపాలనమును నెలకొల్పిరి. అందు టర్కీరాజ్యముయొక్క ఐక్యత కాపాడుటకును, పూర్వపు రాజునే తిరిగి యెన్నుకొనుటకును జరిగిన సంరంభమే ఖిలాఫత్ సమస్య. ఈసమస్య 1919 సం॥రములో టర్కీలో ప్రారంభమైనది. ఈసమస్యాపరిష్కారమునకై హిందూదేశములోని మహమ్మదీయుల సాహాయ్యమపేక్షించిరి. ఈసాహాయ్యము హిందువులచేతకూడ చేయించుటకు గాంధీమహాత్ముడు నిశ్చయించుకొనెను. ఆ ఖిలాఫత్ సమస్య మనస్సులో పెట్టుకొని మహాత్ముడు 6—3—1919 సం॥ దేశస్థు

లందఱచేతను హిందూమహమ్మదీయసఖ్యతకై ప్రైస్త్రవాసస ప్రమాణము స్వీకరింపజేసెను. ఈ మహాత్ముని దీక్షకై మహమ్మదీయులే ఆశ్చర్యచకితులైరి. ఈ ఖిలాఫత్ సమస్యలోని మూలతత్వమును చాలమంది గ్రహించుకొనలేక యీయుద్యమమును నడిపింపవలదని మహాత్ముని నిరుత్సాహపఱచిరి. కాని అందులకు మహాత్ము డంగీకరింపలేదు. గాంధీమహాత్ముడు ఖిలాపత్ సమస్యాపరిష్కారార్థము మహమ్మదీయులకు తోడునీడగాను, స్నేహితుడుగాను ప్రవర్తించెను. సత్యాగ్రహోద్యమముతో యీ ఖిలాపత్ సమస్య జోడించి నడిపెంచుటచే ప్రజలకు ఖిలాపత్ అన నేమో తెలియుట కష్టమయ్యెను. మఱియు సత్యాగ్రహోద్యమమునుగూర్చి కలకత్తాలో 1920 సం॥రములో సెప్టెంబరు 7–8 తేదీలలో జరిగిన ప్రత్యేకకాంగ్రెస్సులో యీయుద్యమప్రచారము పూర్తిగా సాగుటచే ఖిలాపత్ సమస్య దేశములోనే వెనుకబడిపోయినది.

కొందఱి వాదప్రకారము గాంధీమహాత్ముని సత్యాగ్రహోద్యమము మొదటినుండియు ఖిలాపత్ సమస్యాపరిష్కారార్థమే తీసికొనిరాబడినది. పిదప యీసమస్యలోనికి హిందువులను తీసికొనివచ్చుటకై స్వరాజ్యోద్యమము ఉపాంగముగా జేర్చబడినది. కాన, గాంధీజీ మహమ్మదీయసమస్యకే యెక్కుడు ప్రాధాన్య మిచ్చియున్నాడని చరిత్రకారులు వ్రాసియున్నారు.

ఈవిషయమై మన కెట్టివివాదమును లేదు. మొత్తముమీద నీరెండుసమస్యలు గాంధీమహాత్మునిచే సృష్టింపబడినవే,

నమపఋడిన వేళాడ. గాంధీమహాత్ముడు తన ఆధ్వర్యముక్రింద నీరెండుసమస్యలగూర్చి తీవ్రప్రచారము చేసి పని చేయుచుండగా మహమ్మదీయులకు ఒక్క-సంవత్సరము దాటునప్పటికి తొందఱ గలిగినది. మహమ్మదీయులకు దౌర్జన్యరాహిత్యతత్వమునందు విశ్వాసము పోయినది. స్వరాజ్యముకొఱకు ఆగుటకు ప్రయత్నించుటకు యిచ్చగింపలేదు. ఎంతత్వరలో యీ ఖిలాఫత్ సమస్య పరిష్కారము కాగలదు-ఎంతత్వరలో తురుష్క-ప్రభుత్వమునకు సాహాయ్యము దొరకును-అను తొందర కలిగినది.

మహమ్మదీయులు తమకు కలిగిన యీ ఆదుర్దాలో హిందూదేశమువిషయమై మఱచిపోయి ఆఫ్ఘన్ దేశపు రాజును (అమీరును) పిల్చి హిందూదేశముమీదకు దాడి రావలసినదని కోరుటకుకూడ సంసిద్ధులైరి. ఇది హిందువులకు చాలమందికి ఆశ్చర్యమును కొలుపకపోలేదు.

"హిందూదేశములోని బ్రిటిష్‌ప్రభుత్వముపైకి ఆఫ్ఘనిస్థాన్ అమీరు యుద్ధమునకే వచ్చినచో నేను ఆ అమీరునకే సాహాయ్యము చేయుదును. ఎందులకనగా దేశములో ప్రజాభిప్రాయమునకు వ్యతిరేకముగా పరిపాలనము చేయుచున్న ప్రభుత్వమునకు చేదోడుగా నుండుట మహాదోషమని నా యభిప్రాయము."

అని గాంధీమహాత్ముడు ఆనాడు వ్రాసియున్నాడు.

దీనినిబట్టి గాంధీమహాత్మునకు హిందూమహమ్మదీయ

నఖ్యతయం దెంత విశ్వాసము, గౌరవము కలదో తెలియు చున్నది.

కాని యిందువలన ప్రయోజనము లేకపోయెను. 1920 సం॥రమునుండియు మహమ్మదీయులకు హిందువులయెడ ద్వేష ము పెరుగజొచ్చినది. దీనిఫలితమే "మాప్లా" తిరుగుబాటు.

మాప్లా లనువారు దక్షిణదేశములోని మహమ్మదీయులు, వీరికి మహమ్మదీయమతమన్న ఆవేశము మెండు. ఈ ఆవేశములో నొకనాడు తిరుగుబాటు చేసిరి. హిందువుల యిండ్లను తగులబెట్టుట, స్త్రీలను చెరచుట, గర్భవతులను బాధించుట, మహమ్మదీయమతములోనికి హిందువులను మార్పించుట మొదలగు విద్వేషకార్యములు అనేకములుగ జేసిరి. రైలుపట్టాలను తెగగొట్టి, టెలిగ్రాఫుతీగలను నరకి వైచియు, ప్రభుత్వపు బందోబస్తునకు నష్టకష్టములు కల్పించిరి. వివిధరాష్ట్రములనుండి సైన్యములను కొనివచ్చినగాని శాంతి కుదురలేదు. ఈ విప్లవమువలన హిందువులకు అపార ధన, మాన నష్టములు కలుగుటయేగాక, దేవాలయములు ధ్వంస మగుట, హిందువులను బలవంతముగ మహమ్మదీయులలో కలుపుట మొదలగు దారుణములు వేలు జరిగినవి. ఈదారుణములకు కత్తులు, ఈటెలు, బాకులు, పిస్తోళ్ళు, తుపాకులు విరివిగా నుపయోగింపబడినవి. వందలాది ప్రజలు చని పోయిరి. తీరని నష్టము దేశమునకు కలిగినది. ఈతిరుగుబాటు నణచివేయుటకు ప్రభుత్వమునకు కొన్ని మాసములు పట్టినవి.

ఈ మాప్లా తిరుగుబాటు హిందూమహమ్మదీయవిద్వేషములకు నాందీప్రస్తావన మని చెప్పవచ్చును.

ఈ 1920 సం॥నుండి దేశములో హిందూమహమ్మదీయుల విద్వేషవిజృంభణము పెచ్చుపెరిగినది. ఈ క్రిందిపట్టికను బట్టి యేసంవత్సరములో, యేరాష్ట్రములో, యెన్నిదారుణములు జరిగినవో సంగ్రహముగా నిచ్చుచున్నాను.

(1) 1920 సం॥ మాప్లాల తిరుగుబాటు. ఇది ప్రత్యేకము హిందువులకు హింసించుట, మతాంతరము చేయుట మొదలగు దుష్కృత్యములకొఱకై సంకల్పింపబడినది.

(2) 1921-22 బెంగాలు, పంజాబు దేశములలో మొహారంపండుగులకు హిందువులను సర్వవిధముల హింసించిరి. పంజాబులోని ముల్తాన్‌లో యీదారుణపైశాచికకృత్యము మితిమీరినది.

(3) 1923-24 లో కోహాట్‌లో అల్లరులు. ఇవి 1924 సెప్టెంబరు 9-10 తేదీలలో నతిదారుణముగా పెరిగిపోయినవి. ఈకొట్లాటలో 155 గురు మరణించిరి. 9 లక్షల రూపాయల ఆస్తి పాడైనది.

(4) 1924 జూలైలో ఢిల్లీలో దారుణహత్యలు జరిగినవి.

జూలై, ఆగష్టు నెలలలో నాగపురంలో దారుణహత్యలు జరిగినవి.

లాహోర్, లక్నో, మొరదాబాదు, భగల్పూర్ పట్టణాలలోని హిందూమహమ్మదీయసంఘటనలను గూర్చి వేఱుగ వ్రాయనక్కఱలేదు.

(5) హైదరాబాదులోని గుల్బర్గాలో దారుణవధలు జరిగినవి.

(6) సెప్టెంబరు అక్టోబరు నెలలలో లక్నో, షహాజహాన్పూర్, కంకినారా, ప్రయాగలలో దారుణసంఘటనలు జరిగినవి.

(7) 1925–26 లో కలకత్తాలోను, మధ్యరాష్ట్రముల లోను, బొంబాయిరాజధానియందును; ఈఆగష్టులోనే బీహారు, గుజరాతు, మధ్యపరగణాలలోని దారుణహత్యలకు అంతులేదు. అలీఘర్లోని దారుణములు చెప్ప నలవికాదు. షోలాపూరు లోని రథోత్సవసమయములోని కొట్లాట వర్ణనాతీతమైనది.

(8) 1926 ఏప్రిల్ 5–వ తేదీని కలకత్తాలో జరిగిన యీ దారుణహత్యలకు అంతు లేదు. 110 గృహాదహనములు జరిగినవి. హిందూదేవాలయములు విధ్వంసము చేయబడినవి. 44 రు మరణించిరి. 584 రు తీవ్రగాయములకు గుఱియైరి. ఏప్రిల్ 13, 14 తేదీలలో పోలీసువారు 12 సార్లు తుపాకులు పేల్చవలసివచ్చినది. ఈ రెండవసారి జరిగిన అల్లరులలో 66 గురు మరణించిరి. 391 మంది తీవ్రముగ గాయపడిరి.

(9) 1926 ఏప్రిల్నుండి 1927 ఏప్రిల్వఱకు 40 చోట్ల యీ కొట్లాటలు పెచ్చుపెరిగినవి. వీనివల్ల 197 మంది

మరణించిరి. 1598 మంది తీవ్రముగ గాయపడిరి. సింధులోను, బొంబాయిరాష్ట్రములోను యీ అల్లరులు జరిగినవి. జూన్ 1 వ తేదీన కలకత్తాలో జరిగిన అల్లరులవలన 40 మంది తీవ్రముగ గాయపడిరి. జూలై 15 వ తేదీని జరిగిన దేవునియూరేగింపులో తిరిగి కొట్లాట వచ్చినది. ఈకొట్లాటలో 14 గురు చనిపోయిరి. 116 గురు తీవ్రముగ గాయపడిరి. ఈ నెలలోనే 23, 24, 25 తేదీలలో ఈ అల్లరులు ప్రజ్వలించినవి. ఈ అల్లరులలో 28 చంపబడిరి. 226 తీవ్రముగ గాయపడిరి. 15 సెప్టెంబరు, 16 అక్టోబరు తేదీలలో తిరిగి యీఅల్లరులు ప్రారంభించినవి. ఈ అల్లరులలో 2 చనిపోయిరి. 30 మంది గాయపడిరి.

(10) ఈ సంవత్సరాంతములో అనగా 23-12-1926 సం॥ స్వామిశ్రద్ధానందుడు, అబ్దుల్ రషీదువలన పొడిచి చంపబడెను.

(11) ఆవెంటనే లాలానానక్ చంద్ యిట్లు వధింపబడెను.

(12) 1927-28 సం॥రములో ఏప్రిల్ నుండి సెప్టెంబర్ 1927 లోపున 25 సారులు యీ కొట్లాటలు జరిగినవి. వీనిలో 10 సార్లు మధ్యపరగణాలలోను, 6 సార్లు బొంబాయి రాష్ట్రములోను, 2 సార్లు పంజాబ్ లోను, 1 సారి ఢిల్లీలోను మిగిలినవి బెంగాలు, బీహారు, ఒరిస్సాలలోను జరిగినవి. ఈ అల్లరులు అన్నిటివలన 103 గురు మరణించిరి. 1084 మంది తీవ్రముగ గాయపడిరి.

(13) 1927 మే నెలలో లాహోరులో జరిగిన అల్ల రులలో మహమ్మదీయులను, శిక్కులకును తీవ్రపోరాటములు సంఘటిల్లినవి. ఈకొట్లాటలలో 27 గురు మరణించిరి. 272 మంది గాయపడిరి.

(14) 1927 జూలైలో బెహారులోను, ఒరిస్సాలోను యీ అల్లరులు 8 సార్లు విజృంభించినవి. వీనిలో 13 మరణిం చిరి. 24 గురు గాయపడిరి.

(15) 1927 ఆగష్టులో 9 సార్లు యీకల్లోలము పెద్ద పెరిగినది. పంజాబ్‌లోని మూల్టాన్‌లో దారుణవధలు జరిగి నవి. ఇందులో 13 వధింపబడిరి. 24 గాయపడిరి. ఆగష్టు మాసములో 9 సార్లు కొట్లాటలు జరిగినవి. వీనిలో 11 మర ణించిరి. 100 గాయపడిరి. మధ్యపరగణాలలో జరిగిన హత్య లలో 14 మరణించిరి. 165 గాయపడిరి. సెప్టెంబరు నెలలో 4 సార్లు యీకొట్లాటలు జరిగినవి. 19 గురు మరణించిరి. 123 గాయపడిరి.

(16) 1928–29 సంగరములో ఈకొట్లాటలు తక్కువగా జరిగినవి. మొత్తముమీద 22 సార్లు జరిగినవి. కాని బొంబా యిలో జరిగిన దారుణములకు హద్దులేదు. ఈ అల్లరులలో 204 మరణించిరి. వేయిమంది గాయపడిరి. సాట్టా అను గ్రామములో 14 గురు మరణించిరి. 33 గ్గురు గాయపడిరి. ఖడ్గపురములో 2 సార్లు కొట్లాటలు జరిగినవి. 24 గురు మర

ణించిరి. 56 గురు గాయపడిరి. బొంబాయిలో 149 మర
ణించిరి. 700 మంది గాయపడిరి.

(17) 1929-30 సం॥రములో బొంబాయిలోనే యీ
దారుణవధలు జరిగినవి. 35 గురు మరణించిరి. 200 మంది
గాయపడిరి. వీరిలో రంగేళీరసూల్ వ్రాసిన రాజపాల్ అను
హిందువుడు 6-4-1929 సం॥ తేదీని చిత్రవధ గావింపబడెను.

(18) 1930-31 గాంధీమహాత్ముని సత్యాగ్రహోద్య
మము దేశములోని ఉభయపక్షములవారి దృష్టిని ఆకర్షించి
నది. అందుచే తీవ్రమైన కొట్లాటలు జరుగలేదు. 1931 లో
పంజాబులో 907 కొట్లాటలు జరిగినవి.

(19) కాన్పూరులో జరిగిన కొట్లాటలలో దారుణ
వధలు జరిగినవి. గణేశశంకరవిద్యార్థిని కాలుచేతులు గట్టి
కాలుచున్న యిండ్లలోనికి గిరవాటు వైచి బలవంతముగ తగుల
బెట్టిరి. డాక్టరు రామచంద్రన్ అనువాని వృద్ధులైన తల్లితండ్రు
లను, భార్యను, బిడ్డలను, తుదకు రామచంద్రన్నుకూడ సకు
టుంబముగ చిత్రవధ గావించిరి. ఈకొట్లాటలలో 300 మంది
చంపబడిరని వచ్చిన లెక్కలనుబట్టి అనుకొనవచ్చును; గాని 4
లేక 5 వందలమందివఱకు చంపబడినట్లు కానబడుచున్నది.

(20) 1932-33 లో అచ్చటచ్చట చిన్నచిన్న కొట్లా
టలు జరిగెను.

(21) 1933-34 లో బీహారు, ఒరిస్సా, మద్రాసు
రాష్ట్రములలో తీవ్రసంఘటనలు జరిగెను. మధ్యపరగణాల

లోని ఖాజీపూరములోను, బెంగాల్, సింధు, ఢిల్లీలలోను తీవ్ర పరిస్థితు లేర్పడి సంఘటనలు హెచ్చుపెరిగెను. ఆగ్రాలో జరిగిన అల్లరులలో 4 గురు చంపబడిరి. 80 మంది గాయపడిరి. చెన్నపట్టణములో నొకడు చంపబడెను. 13 గురు గాయపడిరి.

(22) 1934–35 లో లాహోరులో తీవ్రపరిస్థితు లేర్పడెను. సెప్టెంబరు 1934 లో నత్తూరామశర్మ కోర్టులో స్వంత దావాకొరకు వెళ్ళియుండగా ఆకోర్టులోనే జడ్జిగారియెదుట అబ్దుల్ ఖయూం అను మహమ్మదీయుడు శర్మను పొడిచి చంపెను. అబ్దుల్ ఖయూంను కోర్టువారు ఉరితీసి వాని బంధువులకు ఇయ్యగా, యీశవమును కొనిపోవుటకు 25 వేల మంది చేరిరి. పెద్ద యూరేగింపు చేసిరి. ఇది ఆటంకపఱచిన పోలీసులకును, తురకలకును సంఘర్షణ జరిగినది. అందులో పోలీసువారు 47 సార్లు తుపాకులు కాల్చిరి. 47 గురు మరణించిరి. దానితో ఉద్రేకము తగ్గి అబ్దుల్ ఖయూంను ఖననము చేసి ప్రజలు వెళ్ళిపోయిరి.

(23) 1935 లో శికందరాబాద్ లో యీ అల్లరులు జరిగెను.

(24) 1936 లో 4 సార్లు యీ దారుణమైన కొట్లాటలు విజృంభించెను. ఆగ్రాజిల్లాలోని ఫిరోజాబాదులో ఈ అల్లరులు ప్రారంభించెను. రాధాకృష్ణ దేవాలయమును పడగొట్టి, ఆ దేవళమునకు ప్రక్కగనున్న డాక్టరు జీవరామును,

ఆయింట్లోనే వున్న 11 గురు హిందువులను, 3 గ్గురు పిల్లలను తగులబెట్టిరి. మిగిలినచోట్ల యింతతీవ్రమైన ఆందోళనలు, దారుణములు జరిగియుండలేదు.

(25) 1937 లో పానిపట్టులో జరిగిన అల్లరులలో 14 గురు చంపబడిరి చెన్నపట్నంలో 50 మంది గాయపడిరి.

(26) 1938 లో రెండుసార్లు యీ తీవ్రసంఘర్షణలు జరిగినవి. ఇవి ప్రయాగలోను, బొంబాయిలోను జరిగెను.

(27) 1939 లో 6 సార్లు యీ మతకలహము పెచ్చు పెరిగెను. అస్సానసోలులో నొకడు మరణించెను, 8 మంది గాయపడిరి. కాన్పూరులో ఫిబ్రవరి 11 వ తేదీని 42 రు చంపబడిరి. 200 ఎరెష్టుచేయబడిరి. ఈసంవత్సరములోనే సింధులోని సుకూరుపరగణాలో దారుణవధలు జరిగినవి. వీనిలో 142 హిందువులు, 14 మహమ్మదీయులు వధింపబడిరి. 58 హిందువులు, 12 మహమ్మదీయులు గాయపడిరి. తగిలిన గాయములవలన మఱికొన్ని దినములకు మరణించిన హిందువులు 9 మంది. ఇంత దారుణహత్యలు యేరాష్ట్రములోను జరిగియుండలేదని చరిత్రకారులు వ్రాసిరి.

ఇంతగోల; ఒక బొంబాయిలో 1929 లగాయితు 1938 వఱకు జరిగిన యీ మతకలహములలో మరణించినవారి సంఖ్య 550. తీవ్రముగ గాయపడినవారి సంఖ్య 4,500. ఈ సంఖ్య యొక్కటే ఒక్క మహాయుద్ధములో జరిగిన జననష్టమునకు మించియున్నది.

బెంగాలులో 1922-27 లో జరిగిన గ్రామమతకలహము లలో యించుమించుగా 35,000 స్త్రీలు చెఱబెట్టబడిరి.

ఇంతదారుణగాథ యింతవిపులముగా నెందులకు వ్రాయ బడెనని యెవరికైన సందేహము తోచవచ్చును. ఈ 1920 నుండి 39 వఱకుగల రమారమి 20 సం॥రముల చరిత్రలో జరిగిన విషాదఘట్టములలో హిందువులవలన మహమ్మదీయులును, మహమ్మదీయులవలన హిందువులును పొందిన అవమానములు, ప్రాణనష్టములు, ఆస్తినష్టములు, స్త్రీమానభంగములు యేయితరనాగరకతగల దేశములోను జరిగియుండ లేదనియు, ఇంతదారుణములు అన్యోన్యవైషమ్యములు గల వ్యతిరేకమత స్థులమధ్యనే జరుగును గాని యితరచోట్ల జరుగనేరవనియు తెల్పుటకే వ్రాయబడినది. మరల సర్వమతసారసంగ్రహమైన హిందూమతముతోడనే పొత్తు కుదరక కేవలము వ్యతిరేకమైన మహమ్మదీయమతము దారుణవధలను, గోవధమును కూడ అంగీకరించుటచేతను, జీవహింస వారి కుగ్గుపాలతో పెట్టిన దగుటచేతను, క్షాత్రముగల జాతి మాది యను అహమును పెట్టుకొని వేయి సం॥రములు రాజ్యపాలనము చేసిన హిందూ దేశము మాది, హిందూప్రజలు మాక్రిందవారు అనే బుద్ధి కొన్నిచోట్ల కొంతమంది మహమ్మదీయుల కుండుటచేతను, హిందువులలో యిది మా దేశము, మా దేశగౌరవము, మా హిందూమతగౌరవము కాపాడుకొనవలసిన బాధ్యత మా దే

అను అహము ప్రబలుటచేతను, దేశమం దన్నిచోట్ల యీదారుణచిత్రవధలు జరిగినవి. ఈదారుణచరిత్ర చదువుటవలన దేశస్థులకు, ప్రజలకు, ధన, మాన, ప్రాణములకు భద్రత లేదు. ఏ వివిధమతస్థు లైక్యముతో కూడినను యితరులకు గలిగిన యభిప్రాయములను తాము మన్నించి పాలించిన గాని సంఘములమధ్య సఖ్యత కుదరనేర దనువిషయమును, ధర్మసిద్ధాంతమును తెలిసికొనలేకపోవుటచేతనే యిట్టి సంఘటనలు జరిగినవని తెలిసికొనవలెను.

మఱియు నీసంఘటనల కొని తెచ్చిపెట్టినగాని వారి రాజకీయములు సక్రమపద్ధతిని నడవవని తలంచిన తీవ్రవాదుల దుర్బోధలే యీదారుణములకు కారణభూతము లైనవని తెలిసికొనవలసి యున్నది. "పాకిస్థాన్" ఏర్పాటు కాలేదు.

---

## మహమ్మదీయులు – రాజకీయదౌర్జన్యము

ఇప్పటివఱకును మహమ్మదీయ–హిందువుల కొట్లాటల గూర్చి విపులముగా వ్రాసియున్నాను. ఇక రాజకీయదౌర్జన్యమునుగూర్చి వ్రాయ బూనుకొంటిని. రాజకీయదౌర్జన్యము అనగా ప్రభుత్వమువారికడనుండి వీరు పొందిన రాజకీయమైన వసతులనుగూర్చి చర్చించుచుంటిని.

1885 సం॥రములో అఖిలభారతకాంగ్రెస్సు స్థాపింపబడెను. దీనిలో స్వరాజ్యమునకు బదులు మంచి ప్రభుత్వ

విధానమును ప్రజలు కోరిరి. అందుచే మొదట 1861 సం॥ర ములో రాజ్యాంగవిధానమును బ్రిటిషుప్రభుత్వము వారు మార్చిరి. ఈ రాజ్యాంగచట్టమునకు రంగు పూసి, పాతదానికే "ఇండియన్ కౌన్సిల్సు ఆక్టు" అను మారుపేరు పెట్టిరి. శాసన సభలకు ఎన్నికలు మామూలుఓటర్లలోనుండి రాక, మ్యునిసిపాలిటీలు, డిస్ట్రిక్టుబోర్డులు, విశ్వవిద్యాలయములు, వ్యాపారకూటములు మొదలగు సంస్థలవలన ఎన్నుకొనబడవలసి యున్నది. ఇందులోనే మహమ్మదీయులకు తొలిసారిగా ప్రాతినిధ్యమును నిర్దిష్టము చేసిరి. కాని యీవిషయముపై చట్టములో ఏవిధముగాను పేర్కొనబడలేదు. అట్టియెడ మహమ్మదీయులకు ప్రత్యేకప్రాతినిధ్యము నేర్పాటుచేయుట యెట్లు సంభవించినది ? ఇది ఆశ్చర్యము! ఏమహమ్మదీయసంఘము ఈకోరికను కోరలేదు. ఎవరును కోరని యీవరమును ప్రభుత్వ మెందుల కొసగవలెను ? చరిత్రనుబట్టి చూచిన యీసూచన చేసినవాడు లార్డు డఫ్రిన్. ఇతడు హిందూదేశపు వైస్రాయిగా పరిపాలించుచుండెడివాడు. ఈతడు ప్రభుత్వమునకు చేసిన సూచనలలో మహమ్మదీయులకు ప్రత్యేకప్రాతినిధ్యము గూర్చి సూచించి యున్నాడు. కారణము- 1885 సం॥లో కాంగ్రెస్సు ప్రారంభింపబడినదని వ్రాసితినిగదా! కావున మహమ్మదీయులు కాంగ్రెస్సులో చేరకుండ ప్రభుత్వముతో పాటుండుటకుగాను డఫ్రిన్ చేయుట్ట మొదట చేయబడినది యీసూచన. దీనితో మహమ్మదీయులకు ప్రత్యేకప్రాతినిధ్యము ప్రారంభ మైనది.

పిమ్మట 1909 సం॥రములో మహమ్మదీయులు లార్డు మింటోగారివద్దకు ప్రతినిధిసంఘముగా వెళ్ళి వారికడ తమకోరికలు నివేదించుకొనిరి. ఆకోరికలు—

(1) మ్యునిసిపల్, డిస్ట్రిక్టుబోర్డులలో తమకుగల అధిక సంఖ్యాబలమును అనగా (జనాభాలెక్కలనుబట్టి వచ్చిన బలము,) సాంఘిక ఔన్నత్యమును, ప్రజలలోని పలుకుబడిని పురస్కరించుకొని, ప్రత్యేకస్థానముల నేర్పాటు చేయవలసిన దనియు,

(2) విశ్వవిద్యాలయములలోని అధికారవర్గములో ప్రాతినిధ్యము కావలె ననియు,

(3) మహమ్మదీయులలోని భూకామందులు, న్యాయవాదులు, వర్తకులు, ఇతరవృత్తులనుబట్టి స్థితిగతులనుబట్టి యున్నతికి వచ్చినవారికిని, విశ్వవిద్యాలయములలోని గ్రాడ్యుయేట్సుకును, రాష్ట్రసభలలో ప్రాతినిధ్యము కావలె ననియు,

(4) రాష్ట్రశాసనసభలలోవలెనే, ఇంపీరియల్ స్టేటు కౌన్సిలులోగూడ కేవలము అల్పసంఖ్యాకులుగాక తగిన ప్రాతినిధ్యము సరిగా నీయవలె ననియు కోరిరి.

ఈ కోరికలు 1909 లో ప్రభుత్వమువారిచే ఆమోదింపబడెను. దీనివలన,

(1) వారి ప్రతినిధులను వారు యెన్నుకొనుటకును,

(2) ప్రత్యేకనియోజకవర్గములద్వారా వారి ప్రతినిధులను యెన్నుకొనుటకును,

(3) మామూలు యెన్నికలలో వారికుండే జనసామాన్యముతో పాటు ఓటు చేయు నధికారమును,

(4) జనాభా లెక్కప్రకారము వారి ప్రతినిధి సంఖ్య నేర్పాటు చేయుట జరిగినది.

ఈ ఆక్టు పంజాబునకును, మధ్యపరగణాలకును వర్తింపదు.

పిదప 1916 సం॥రమున అక్టోబరులో 19 మంది ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిలుసభ్యులు, లార్డు ఛెలమ్సుఫర్డు వైస్రాయి దగ్గఱకు ప్రాతినిధ్యమును తీసుకొని వెళ్ళిరి. అప్పుడు,

(1) పంజాబు, మధ్యరాష్ట్రములలోను, మహమ్మదీయులకు ప్రత్యేకప్రాతినిధ్యము నేర్పాటు చేయవలసిన దనియు,

(2) రాష్ట్రశాసనసభలలోను, యింపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిలులోను తమకు ప్రాతినిధ్యబలమును స్థిరీకరించవలయు ననియు,

(3) మహమ్మదీయమతమును, మతధర్మములను శాసనసభలలో చర్చింపకుండ తగు సంరక్షణల నొసంగవలసిన దనియు కోరిరి.

ఈ పైన పేర్కొన్న కోరికలచొప్పున లక్నోలో హిందూ మహమ్మదీయుల కొకసంధి జరిగినది. దానినే "లక్నో ప్యాక్టు" అందురు. దానివలన మహమ్మదీయులకు శాశ్వతమైన యుపకారము జరిగినది. సరియైన ప్రాతినిధ్యములు సమకూఱినవి.

ఈ లక్నోప్యాక్టులో హిందువులు, మహమ్మదీయులు అంగీకరించిన ముఖ్యసూత్రములు, ప్రభుత్వమున కంత అంగీకారముగా లేకపోయినను వారు 1919 సం॥లో నిర్మించిన మాంటేగు ఛెల్మ్సుఫర్డు రిఫారమ్సులో చేర్చక తప్పినదికాదు.

పిదప 1927 సం॥రములో మన దేశమునకు సైమనుకమీషను వచ్చినది. ఈకమీషను దేశములోని రాజ్యాంగవిధానములో క్రొత్తసూచనల నేర్పాటు గావించుటకై ప్రభుత్వముచే పంపబడినది. అప్పుడు కాంగ్రెస్సు యీ సైమనుకమీషనును బహిష్కరించి వారియెదుట సాక్ష్యము నిచ్చుట మానివేసినది. కాని మహమ్మదీయులు అనేక సభలలోనుండి వారికి కావలసిన కోర్కె లన్నియు కోరిరి. ముస్లింలీగువారు, అఖిలభారతముస్లింసభవారును, అఖిలపక్షమహమ్మదీయసభవారును, జమయత్-ఉల్-ఉలేమావారు, ఖిలాఫత్ సంఘమువారును, తమతమ కోర్కెలను నివేదించుకొనిరి. వీనిలో మహమ్మదాలీజిన్నా గారి సూచనలే సమగ్రముగా నున్నవి. అతడు 15 ప్రత్యేకపు కోరికల కోరెను. అన్నిరాష్ట్రములకు స్వేచ్ఛ, అన్నిరాష్ట్రములలోను, కేంద్రములోను, మహమ్మదీయులకు ౩ వ వంతుకు తక్కువగాని ప్రాతినిధ్యము, ఉద్యోగములలో ప్రత్యేకత మొదలగు కోరికలు కోరెను. ఈకోరికలు హిందూఅభిప్రాయములకు భిన్నము లనియు, యివి ఆమోదింపదగినవి కావనియు హిందువులు వ్యతిరేకముగా సైమనుకు నివేదించిరి. హిందువులు

చెప్పిన విషయములను శ్రద్ధగా నాలించి సైమనుకమీషను మహమ్మదీయుల కోరికలను నిరాకరించిరి. కాని హిందువుల యొక్కయు, సిక్కులయొక్కయు, తుదకు సైమనుకమీషను వారియొక్కయు అనంగీకారమైన మహమ్మదీయుల కోరిక లన్నియు బ్రిటిషుప్రభుత్వమువారు స్వయముగా పోక్యము కలుగ జేసుకొని మహమ్మదీయులకు సంపూర్ణవరప్రదాన మొసగిరి.

ఈ వరప్రదానమును ది 25 జనవరి 1932 సం॥ తేదీని హిందూదేశపు ప్రభుత్వమువారు తమ గెజటీలలో ప్రకటించిరి. దీనివలన 1935 లో పశ్చిమోత్తమపరగణాలు ఒక ప్రత్యేక రాష్ట్రముగా నేర్పాటు చేయబడి దానిపాలనమునకు ఒక గవ ర్నరును నిర్ణయించిరి. పిమ్మట 1936 సం॥ బొంబాయిరాజ ధానిలోని సింధుప్రాంతమును విడదీసి దాని నొక ప్రత్యేక రాష్ట్రముగ నేర్పాటు గావించి దానిపాలనమున కొక గవర్న రును యేర్పాటు చేసిరి. నూటికి 25 ఉద్యోగములు మహమ్మ దీయులకే యీయవలె నని 1934 సం॥ సెక్రటరీ ఆఫ్ స్టేటు తాఖీదు పంపించెను. రాష్ట్రసంఘములపై అధికారము కేంద్ర సంఘమున కుండకూడదని మహమ్మదీయులు కోరిన కోరికలోని అంతరార్థము కేంద్రసంఘములో హిందువు లెక్కువగ నుం దురు గాన అట్టి అధికసంఖ్యాబలము గలిగిన హిందువులచేతిక్రింద మహమ్మదీయరాష్ట్రములు వర్ధిల్లనేరవనియే. ఇది గ్రహించి ప్రభుత్వము యీకోరికను ఔనని యనక-కాదని అనలేక- యీ

రాష్ట్రప్రభుత్వములపైన అధికారము వైస్రాయి చేతిలో పెట్టి వానియిష్టానుసారము జరుగవలెనని చెప్పిరి. దీనిని బట్టి కేంద్ర ప్రభుత్వమువారికి రాష్ట్రప్రభుత్వములపై అధికారమును తీసివేసి నట్లు బుజువగుచున్నది. ఈ 1932 సం॥రములో మహమ్మ దీయులకు ప్రభుత్వ మొసగిన వరప్రదానమే "1932 సం॥రపు కమ్యూనల్ అవార్డు" అందురు. దీనివలన మహమ్మదీయుల కోరిక లన్నియు నెరవేరినవి.

1931–వ సం॥రములో జరిగిన రౌండ్ టేబిల్ సమావేశ మందు మహమ్మదీయులు పెట్టుకొన్న మొఱ్ఱలును, అంతకు ముందు సైమన్ కమీషన్ వద్ద పెట్టుకొన్న నివేదనలున్ను బ్రిటిష్ ప్రభుత్వము పూర్తిగా ఆలించి వారికోరిక లన్నియు తీర్చి నది. కాని మహమ్మదీయులకుమాత్రము కోర్కెలు పూర్తి కాలేదు. అవి అప్పటిలో ప్రకటింపబడలేదు. కాని జవహరుచే పిదప ప్రకటింపబడెను. వానిలో మహమ్మదీయులు చేయు గోవధను హిందువు లంగీకరించవలె ననియు, హిందువులు "వందేమాతరం" పాడగూడ దనియు మొదలగు విచిత్రపు షరతులు 14 కలవు.

ఇవియేకాక 1938–39 మధ్య యింకొక కోరికకూడ మహమ్మదీయులకు పొడమినది. అది– అన్నిటిలోనుకూడ మహ మ్మదీయులకు నూటికి యేబదిపాళ్ళు ప్రాతినిధ్య ముండితీరవలె ననుకోరిక. ఇట్టి అసంబద్ధమైన కోరికలు మహమ్మదీయులు

కోరుట ప్రారంభించిరి. మహమ్మదీయుల కోరికలు తీర్చుటయే బ్రిటిషు వారు పెట్టుకొన్న ఆశయము. ఇందులకు కారణము మొదటనే వ్రాసియున్నాను. అది హిందువులలోనుండి మహమ్మదీయులను విడదీసి తమపక్షమునకు త్రిప్పుకొనుటయే. ఇదియే మహమ్మదీయులకు అమితశక్తి నొసంగినది. గతప్రకరణములో హిందువులపట్ల మహమ్మదీయులు చేసిన దౌర్జన్యములను నిరూపించితిని. ఈప్రకరణములో ప్రభుత్వమునకు మహమ్మదీయులకును గలిగిన పొత్తులు, యిచ్చిన వరములు మొదలగునవి నిరూపించితిని. ఈ రెంటిని చదువరులు సమన్వయించుకొందురు గాక. మహమ్మదీయుల కత్తిపోటు కెరయైనవారు హిందువులు. పైగా పాలకులైన బ్రిటిష్‌ప్రభుత్వము వారిచే తీర్చరాని కోరికలు తీర్పించుకొనగలిగినది మహమ్మదీయులు. కావున యీ చరిత్రములో ఉభయపక్షములనుండియు అపాయనష్టముల పొందినవారు మన హిందువులే. హిందువులను హింసించినందులకై కాబోలు బ్రిటిషువారు మహమ్మదీయులకు వలసిన వరముల ప్రసాదించిరి! రాజనీతిజ్ఞులైన బ్రిటిషుప్రభుత్వమువారు 1889 సం॥రమునుండి 1946 సం॥రమువరకు చూపించిన రాజనీతి "చీలించి, పాలించు" అను సూత్రముపై నాధారపడినది. కావున తుదకు హిందూదేశమునే సంపూర్ణముగ వదలుకొనవలసినవారైరి.

---

# పాకీస్థాన్

గత రెండు ప్రకరణములలోను నిరూపించిన దేశములోని సంఘటనములు, మహామ్మదీయుల రాజకీయ ఆందోళనములను బట్టి మహామ్మదీయులకు ప్రత్యేక రాజ్యము లభించినది. ఈ రాజ్యభాగమునే "పాకీస్థాన్" అందురు. అనగా స్వచ్ఛమైన దేశమని అర్థము.

ఈపదము మోహాక్‌కు సంబంధించిన హాజీ-ఛేదరీషా మహామ్మద్ కుమారుడైన ఛేదరీరహామత్ ఆలీచే సృష్టింపబడినది. ఇతడు కేంబ్రిడ్జియూనివర్సిటీలోని విద్యార్థి. ఈతడు తనమిత్రు లతో "ఇప్పుడు కాకపోయిన ఎంకెప్పుడును లేదు" అనే శీర్షిక క్రింద నొకవ్యాసమును వ్రాసి అందులో మహామ్మదీయులకు పాకీస్థాన్ కావలె నని పేర్కొనెను. అప్పటినుండి పాకీస్థాన్ పేరు నిలిచిపోయినది.

మహామ్మదీయులకు ప్రత్యేక రాజ్యభాగము కావలెనను నభిప్రాయము 1940 లో కలిగినది. ఇందులకు కారణము, హిందువులు భారతదేశమునకు 1929 లో సంపూర్ణ స్వాతంత్ర్య మును కోరుకొనుటచే. ఏనాడైన హిందువులకు సంపూర్ణ స్వాతంత్ర్యము నొసంగి బ్రిటిషుప్రభుత్వము దేశమును విడిచి వెడలిపోయినచో హిందువుల యాజమాన్యమున భారతదేశము పరిపాలింపబడు ననియు, అప్పుడు మహామ్మదీయులు హిందు వుల అధికారమునకు లోనై యుండిపోవలసినవా రగుదురని

తలంచుకొనిరి. అందుచే సట్టిసెపరీత్యము రాకుండుటకుగాను తీవ్రాలోచనానిమగ్నులై, హిందువులు స్వరాజ్యమును, స్వతంత్రత కోరుకొనగాలేనిది మన మేల కోరుకొనగూడదని నిర్ణయించుకొనిరి. అందుచే మహమ్మదీయులు లాహోరులో సమావేశమై, తమ మహమ్మదీయమతమునకు భవిష్యద్రాజ్యనిర్మాణములో అపారనష్టము రానైయున్నది కావున నిప్పటినుండియు మేల్కొనవలసియున్నదని కృతనిశ్చయులై యీదిగువ నుదహరించిన తీర్మానములను ఏకగ్రీవముగా నంగీకరించిరి.

ఆతీర్మానముల నీక్రింద పొందుపఱచుచున్నాను.

ది 26-3-1940 సం॥రమున లాహోరులో ముస్లింలీగు మహాసభవారి తీర్మానములు.

(1) ఆల్ యిండియా ముస్లింలీగుసభవారు 1939 సం॥రములో ఆగష్టు 17, సెప్టెంబరు 17, 18 తేదీలలోను, అక్టోబరు 22వ తేదీని సమావేశములు జరిపి, వానిలో అంగీకరించిన తీర్మానములును మఱియు 1940 సం॥ ఫిబ్రవరి 3వ తేదీని రాజ్యాంగచట్టముపై ఆమోదించిన తీర్మానములును యీమహాసభవారు ఆమోదించుచున్నారు. అఖిలభారతప్రభుత్వమువారు 1935 సం॥ రాజ్యాంగచట్టములోని నిబంధనములు, మహమ్మదీయమహాసంఘమువారి ఆశయములకు వ్యతిరేకముగా నుండుటచే, ఆనిబంధనలు ముస్లింలీగువారు అంగీకరింపజాలరని తీర్మానించుచున్నారు.

(2) 1935 సం॥రపు రాజ్యాంగచట్టములోని నిబంధనల గూర్చి అమలుపఱచుటకు వివిధపక్షములవారితోను, తత్సంబంధీకులతోను, వివిధమతస్థులతోను సంప్రదించినపిదప అమలు పఱచెదమని 1939 సం॥రము అక్టోబరు 18-వ తేదీని వైస్రాయి గారి యుపన్యాసములో చెప్పిన భావమును అంగీకరింపరాదు యీ సభవారు తమ అమోదమును వెలిబుచ్చుచున్నారు. మఱియు తమతో పూర్తిగా సంప్రదించి, వారి పూర్తియామోదమును తీసుకొన్నపిదప, నూతనరాజ్యాంగసంస్కరణచట్టమును నిర్మించవలసినదే కాని, 1935 సం॥రపు చట్టములో కొన్ని స్వల్ప మార్పులను చేయుటకుమాత్రము యీసభవారు అంగీకరింపజాలరు.

(3) మఱియు అధికసంఖ్యాకులైన మహమ్మదీయులుగల పశ్చిమోత్తరభాగములు, తూర్పుబంగాళాభూభాగములును కలిపి ప్రత్యేక మహమ్మదీయరాజ్యభాగముగా విడదీసి యేర్పాటుగావించి వారికి సర్వాధికారములు నొసంగి వారిభూభాగమును వారు పరిపాలించుకొనుట కధికారము కలుగజేసినగాని యీ ముస్లింలీగువారు 1935 సం॥రపు రాజ్యాంగచట్టమును అంగీకరింపజాలరు.

(4) హిందూదేశములోని, వివిధప్రాంతములలోని అల్పసంఖ్యాకులైన మహమ్మదీయులకు మత, వైజ్ఞానిక, సాంఘిక, రాజకీయ విషయములలో సంపూర్ణాధికారములను,

తగినసంరక్షణము లను యిచ్చినగాని వారికి తగినసంరక్షత యేర్పడజాలదు. కాబట్టి ఈసభవారు అల్పసంఖ్యాకులైన మహమ్మదీయులకై చేయబోవు ప్రత్యేకపుటేర్పాటులు, అఖిల భారతముస్లింలీగువారితో సంప్రదించి చేసినగాని ప్రభుత్వము వారి రాజ్యాంగచట్టమును అంగీకరింపజాలము.

(5) పైవిషయము లన్నియు మనస్సులో పెట్టుకొని సరియైన ఒక రాజ్యాంగసంస్కరణచట్టమును నిర్మాణము చేయుటకు అఖిలభారతముస్లింలీగువారు తమ కార్యవర్గసభవారికి అధికార మిచ్చుచున్నారు.

అను ఐదు తీర్మానములను ముస్లింలీగువారు ఆమోదించిరి. దీనినిబట్టి మొగలాయీచక్రవర్తులతో నంతరించిన మహమ్మదీయ రాజ్యమును హిందూదేశములో తిరిగి ప్రతిష్ఠించుటకు యిదే సరియైన అదను అని మహమ్మదీయులు నిశ్చయించుకొనిరి. హిందూదేశములోకూడ తిరిగి మహమ్మదీయ రాజ్యస్థాపన జరిగితీరవలె ననియే వారి యభిప్రాయము. మహమ్మదాలీజిన్నా "పాకీస్థాన్" నుగురించి తీర్మానించినపిదప సభ పరిసమాప్తి చేయుచు ఈక్రిందివిధముగా నుపన్యసించెను.

"మనకు దీనివలన మంచి చేకూరగలదు గాని, చెడుగు జరుగుటకు కూడ అంతే సావకాశము కలదు. మఱియు నేడు పాకీస్థాన్ విషయము అధికసంఖ్యాకులయొక్కగాని, అల్పసంఖ్యాకులయొక్కగాని విషయము గాక యిది ఏకగ్రీవమైన మహమ్మ

దీయజాతియొక్క ముఖ్యమైన కోరిక. హిందువులే అధికసంఖ్యాకులుగానున్న రాష్ట్రములలోనున్న మహమ్మదీయులే తమ తాలూకు 7 కోట్ల మహమ్మదీయులకు స్వతంత్రరాష్ట్రముతో స్వేచ్ఛగా నుండుటకై కోరుచుండిరి. రాజకీయప్రణాళికలో సూచించిన సంరక్షకచట్టములకంటె, పాకీస్థానమే అల్పసంఖ్యాకులుగా నున్న మహమ్మదీయుల కెక్కుడు సంరక్షణ మొసంగగలదు. ఈరాజకీయప్రణాళికలో సంరక్షణచట్టములు 5 సం॥రముల అనంతరమున అధికసంఖ్యాకులైన హిందువులచే తుడిచివేయబడ వనునమ్మిక ఏమి కలదు? అధికసంఖ్యాకులైన హిందువులచే ప్రత్యేకపు టెన్నికల యేర్పాటులు సవరించి మార్చి వేసిన మనకు గత్యంతర మేమియున్నది? మనసంరక్షణలు ఒక్కొక్కటే రద్దుచేయబడిన మనకు దారికలదా? అందుచే పాకీస్థాను మనకవసరము. హిందూదేశములో అల్పసంఖ్యాకులైన మహమ్మదీయులకు గల సంరక్షణలలో లోప మేమైన జరిగిన పాకీస్థాన్ ప్రభుత్వము చూచుచు ఊరకోనదు. అప్పుడు మహమ్మదీయులకు ప్రక్క నిలిచి హిందువులతో పోరాడవలసివచ్చిన తప్పక మహమ్మదీయులకు పాకీస్థాన్ప్రభుత్వము సాయము చేసితీరును. 1935 సం॥ చట్టముక్రింద మనదేశములో అనగా పాకీస్థానములో మంత్రిపదవులు నిర్మించినప్పుడు అల్పసంఖ్యాక వర్గములకు కూడ యీ మంత్రివర్గములో ప్రాతినిధ్యము కావలెనట. అది రద్దుచేసి పాకీస్థానములోని అల్పసంఖ్యాకవర్గము వారికి మంత్రిపదవులలో ప్రాతినిధ్యము తీసివేయబడవలెను. హిందు

వులు మనకు అభ్యంతర పెట్టవచ్చును. తుదకు అస్థి రావచ్చును. ఎవ రేమి చేసినను, చెప్పినను మహామ్మదీయులకు "పాకిస్థాన్" యిచ్చితీరవలసిన దే, వేఱు ఇందులకు గత్యంతరము లేదు. ఆసభలోనే అబ్దుల్ ఖయ్యూంఖాన్ మాట్లాడుచు నిట్లు చెప్పెను.

హిందువులు దేశములో తమ స్థానమును, శక్తిని ఆంగ్లేయుల భుజబలముచే చిరస్థాయి చేసుకొనుటకు బ్రిటిషుప్రభుత్వమువారిని యింకను హిందూదేశములో నుండవలసినదని కోరుచున్నారు. అట్లెన్నటికిని జరుగరాదు. మనకు ఒక్కపతాకము ఒక నాయకుడు ఒకేవేదిక ఒకే ఆశయము కలవు. అదే "పాకిస్థాన్." అందులకే మనము పోరాడితీరవలె. ఈపాకిస్థానమును సంపాదించుకొనుటకు యేది అవసరమైన నదియెల్ల చేయుటకు సర్వసిద్ధమై యుంటిమి. ఇది కాంగ్రెస్సువారిని కాని హిందువులను గాని జడిపించుటకు చెప్పుటలేదు. ఉత్తరోత్తరా ప్రభుత్వమువారు హిందూదేశములోని పాకిస్థాన్ భాగమును మహామ్మదీయులకు పంచి యిచ్చినపిదపనే వారొకవేళ వెడలి పోవలసివచ్చిన, వెళ్ళవలసిన దే కాని లేనిచో హిందువులతో మేము కత్తిపట్టుకొని పోరాడితీరవలసిన దే. ఇది మా నిశ్చితాభిప్రాయ" మని చెప్పెను.

ఆసభలోనే సర్ ఫిరోజ్ ఖానూనారు మాట్లాడుచు "హిందువులు మాకు పాకిస్థానము నిచ్చిరా మాకు వారు ఆప్తులే. మాకు మా స్వతంత్ర రాజ్యము కావలెను. అది

మాకు వచ్చితీరవలెను. ఈ స్వతంత్రతను సంపాదించుకొనుటకై మేము యుద్ధము చేయవలసివచ్చిన సంసిద్ధులమగుదుము. కాని అఖండభారతములో మా పిల్లలను బానిసలుగా నుంచజాలము. బ్రిటిషువారు దేశములో నున్న మహమ్మదీయులను మఱచి హిందూ దేశములోని (కోమట్లు) (గాంధీజీని) చూచి వారితో రాజీ నామా చేసుకొనిన మేము రష్యావారిని సాహాయ్యము కోరుకొని హిందూదేశముపైకి యుద్ధమునకు వచ్చెదము గాని ఊరకొనము" అని యుపన్యాస మిచ్చెను.

ఈ సమావేశానంతరము ఈ క్రిందిగువ ప్రమాణమును తీసుకొనిరి.

"పాకిస్థాన్ సంపాదనవిషయములో ఎట్టి కష్టములకు లోనుగావలసివచ్చినను, ఎట్టి త్యాగములు చేయవలసివచ్చినను నేను సంసిద్ధముగా నుందును".

ఈప్రమాణము తీసుకొన్న పిదప నాటిసభ ముగిసినది.

ఇట్టి బెదరింపులతో తీసికొనిన "పాకిస్థాన్" వలన ఒకటి తాత్కాలికావసరము, రెండవది దూర మాలోచింపవలసినది.

మొదటిది: ఆఫ్రికా దేశములో నుత్తరమున నున్న మొరాకోనుండీ, సూడాన్, ఈజిప్టు, అరేబియా, పర్షియా, ఆఫ్ఘనిస్థాన్ మొదలగు రాజ్యము లన్నియు మహమ్మదీయులవే. అట్టి మహమ్మదీయ రాజ్యసమ్మేళనములోకూడ యీ పాకిస్థాన్ జేర్చవచ్చు ననియు, అందుచే మధ్యఖండములో

నున్న మహమ్మదీయరాజ్యములతో సఖ్యత నేర్పాటు గావించుకొని పాన్ ఇస్లామిక్ దేశము లన్నియు కలిసి యొక మహమ్మదీయసామ్రాజ్యము క్రిందకు జేరిపోవచ్చు ననియు, అవసరము వెంబడి కాఫర్ దేశస్థులమీదకు జీహాద్ నడిపింపవచ్చు ననియు; రెండవది: హిందూదేశముపైకి మహమ్మదీయసైన్యముల నడిపించుకొనివచ్చి పూర్వమువలెనే భారతదేశములో మహమ్మదీయసామ్రాజ్యమును స్థాపించుకొనవచ్చుననియు- నాలోచనలతో యీ "పాకిస్థాన్" హిందూదేశములోని విభాగముగా మహమ్మదీయులు కోరుకొనిరి; కాని వేఱుకారణము లేదని చరిత్రకారులు వ్రాసియున్నారు. మఱియు నీ "పాకిస్థాన్" యేర్పాటు చేయుటవలన మహమ్మదీయులకు ప్రయోజనము లేదనియు వ్రాయుచు నందులకు రెండు సక్రమములైన కారణముల నిరూపించియున్నారు.

1. మహమ్మదీయులు యెక్కువగానున్న ప్రదేశములు కలిసిగదా పాకిస్థాన్. అక్కడ సర్వాధికారములు సహజముగ మహమ్మదీయులకు వచ్చియేతీరునే- అట్టియెడ నిక "పాకిస్థాన్" ఎందులకు ?

2. ముసల్మానులు తక్కువగానుండి హిందువు లెక్కువగనున్నచోట ఒకటి కాదు రెండు పాకిస్థానులు పెట్టుకొని హిందువులను అధికసంఖ్యాకులుగా నున్నవారిని యేమిచేయగలరు. కావున యేవిధముగా చూచినను పాకిస్థాన్ యేర్పాటు చేసుకొనుట వృథాశ్రమ కాని కార్యకారి కాదు.

ఇక నొక్క విషయము: హిందువులు అధికసంఖ్యాకు లగుటచే మహమ్మదీయులు అల్పసంఖ్యాకులై సంరక్షణాల కోరినను సంతృప్తి చెందక పాకిస్థాను కోరిరి. సరే. అట్లయిన మహమ్మదీయులు అధికసంఖ్యాకులైన రాష్ట్రములలో హిందువులు అల్పసంఖ్యాకులుగ నుందురే? మఱి వారి గతి యేమి! మహమ్మదీయు లొకజాతివారైనట్లే హిందువు లొకజాతివారు మాత్రము కారా? అప్పుడు హిందువులకు సంరక్షణలు హిందూస్థానులో పాకిస్థాను ఏర్పడినట్లే పాకిస్థానులో హిందూస్థాను ఏర్పడనక్కఱలేదా? హిందువులపై మహమ్మదీయులకు విశ్వాసము లేనట్లే, మహమ్మదీయులపై హిందువుల కెంతు లకు విశ్వాస ముండవలెను?

అధికసంఖ్యాకులైన మహమ్మదీయులు గల రాష్ట్రములో రాజు హిందువుడైన- ఆ రాజ్యము పాకిస్థాన్‌లో చేరవలెనా? ప్రజలు హిందువులై రాజు మహమ్మదీయుడైన ఆ రాజ్యము పాకిస్థాన్‌లో చేరవలెనా? ఈసమస్య మహమ్మదీయులకు తీరనిసమస్య యైనది. రాష్ట్రములోని ప్రజలు మహమ్మదీయులు కాబట్టి రాష్ట్రమంతయు పాకిస్థాన్‌లో చేరవలసివచ్చునని చెప్పినచో, రాష్ట్రములోని ప్రజలు హిందువులు గాన రాష్ట్రమంతయు హిందూస్థానులో చేరిపోవలసివచ్చును. ఇవే కాశ్మీరు-హైదరాబాదు సమస్యలు. కాశ్మీరులో నూటికి తొంబదిమంది మహమ్మదీయులు-పరిపాలకుడు ఉత్తమహైందవ

ానికి చెందిన క్షత్రియుడు. హైదరాబాదులో నూటికి తొం బదిమంది హిందువులు-పరిపాలకుడు నైజాం. ఇతడు మహమ్మదీయుడు. కావున యీరెండింటిలో ఏరాష్ట్రము హిందూస్థాన్‌లో చేరవలెను? ఏది పాకీస్థాన్‌లో చేరవలెను? ఈరెంటిలో నొకసమస్య స్వక్రమముగా తేలిపోయినది. అది హైదరాబాదుసమస్య. ఇక రెండవది కాశ్మీరు సమస్య. ఈ కాశ్మీరు హైదరాబాదులనుగూర్చి ముందు ముందు విపులముగ చర్చింతును.

---

## పాకీస్థాన్ మహమ్మదీయులు

మహమ్మదీయులలోనే మోమినీనులను నొక శాఖయు లున్నారు. వారీ పాకీస్థాన్ సమస్యకు వ్యతిరేకులు. వారి నాయకుడైన అబ్దుల్ ఖయూంఅన్సారీ యీక్రిందివిధముగా తన యభిప్రాయమును వెలిబుచ్చెను.

"హిందూదేశములోని మహమ్మదీయులలో 5 కోట్ల మంది మహమ్మదీయులు మోమినీనులై ముస్లింలీగును వారి యాధిపత్యమును అంగీకరించుట లేదు. వారి నాయకత్వము పనికిరాదు. మోమినీనులకు అఖిలభారతమోమినీను మహాసభ కలదు. ఈసభవారే ముస్లింలీగుకు వ్యతిరేకులు. వారి పాకీస్థాన్, మోమినీనులకు మాతృభూమియైన హిందూదేశమునకు

అనర్థదాయకముగను, మహమ్మదీయాభిప్రాయములకు వ్యతిరేకముగను నున్నదని మోమినీనుల అభిప్రాయము".

అను భావము వెలిబుచ్చెను.

అఖిల బంగాళా కృషిక ప్రజాసమితి అధ్యక్షుడైన సయ్యద అబిబుర్ రహామాన్ యిట్లు తనయభిప్రాయము వెలిబుచ్చెను.

"మహమ్మదీయులు హిందూదేశమునకు వచ్చిన పిమ్మట యీదేశమునే వారి మాతృభూమిగా అంగీకరించిరి. ఉర్దూ, హిందీభాషలు వారి వాడుకభాషలుగా యీదేశములో నొక నూతనజాతిని సృష్టించగలిగిరి. హిందూమహమ్మదీయ సఖ్యతతో నొక నూతన నాగరికత, విజ్ఞానము ప్రబలినవి. ఇక్కడి హిందూమహమ్మదీయులు కలిసి ఏకజాతివారైరి. ఇక్కడి మహమ్మదీయులలో చాలామంది హిందువులలోని యెముకల లోని యెముకలై, కండరములలో కండరములై మసలజొచ్చిరి. మతముకంటె జాతి ముఖ్యము. ఈవిషయమును ముస్లింలీగు వారు గమనించకపోవుట చాలా దురదృష్టము."

మధ్యరాష్ట్రములలోని మాజీముఖ్యమంత్రి మహమ్మద్ యూసఫ్ షరీఫ్, దక్షిణదేశపు యువజనసంఘ సభాధ్యక్షత వహించి యిట్లుపన్యసించెను.

"హిందూదేశములో సుహృద్భావమును పెంపొందచేసి, ఐక్యతను సమకూర్చకుండ, దేశవిభజనలో పాల్గొని, హిందూ

రాజ్యమని, మహామ్మదీయ రాజ్యమని- హిందూదేశమును విడ గొట్టిన యెడల విభేదము ఆరనిమంటయై, అంతర్యుద్ధములను రగుల్చుచుండగా అట్టి దేశములో స్వతంత్రత యెన్నినాళ్లు నిలువగలదు. దేశవిభజనమైన యేజాతికిని శాంతిభద్రత లుండ నేరవు. దేశములో హిందువులు, మహమ్మదీయులని- రెండు జాతులు వర్ధిల్లుచున్నంత కాలము ఒకరిపై నొకరికి యనుమానములు ద్వేషములు పెచ్చుపెరుగుచునే యుండును."

వీ రేగాక కాంగ్రెస్సునాయకుడైన మహాత్మాగాంధీ హిందూదేశవిభజన కంగీకరింపక

"8 కోట్లమంది మహామ్మదీయులకు నేనొక సందేశమివ్వవలసి యున్నది. ఈ 8 కోట్ల మంది మహామ్మదీయులకు వ్యతిరేకముగనుండి హిందువులు స్వరాజ్యమును సంపాదించుకొనలేరు; కాని యీ 8 కోట్ల మహామ్మదీయులు యీదేశ స్వాతంత్ర్యమునకు వ్యతిరేకులని నేను నమ్మజాలను. హిందువులలోనుండి విడివడి ప్రత్యేకముగా మహామ్మదీయులు స్వరాజ్యమును సంపాదించుకొనగలిగినవారు సంపాదించుకొనవచ్చును. హిందువులతో, మహామ్మదీయులతో, తదితరులతో హిందూదేశము దరిద్రదేశమైనది. ఈదేశమును రెండుగా విభజించుట అరాచకమును తెచ్చిపెట్టుటవంటిది. ఈ-టీల్చివేత [illegible]కరింపజాలనిది. నేను హిందువుడ నగుటచేగాదు,- నేను హిందువులకు, మహామ్మదీయులకు, శిక్కులకు, తదితర మత

ష్ఠులకు ప్రతినిధిగా మాట్లాడుచున్నాను కావున నేను వారికి చెప్పునది, నన్ను ముందు చీల్చి పిదప దేశమును చీల్చి విభజించుకొండు. మొగలాయీలు ఈ దేశమును రెండువందల సంవత్సరములు పరిపాలించియు హిందూదేశమును ఖండములుగా చీల్చి పాలించలేదు" అని గాంధీజీ చెప్పియున్నాడు.

## పాకీస్థాన్‌లోని సంపద

పాకీస్థాన్‌లోని సంపదను గూర్చి వ్రాయవలసియున్నది.

| | | | | |
|---|---|---|---|---|
| (1) | పశ్చిమోత్తరపరగణాలు | చతురపు | 13,518 | మైళ్లు |
| (2) | పంజాబు | ,, | 91,919 | ,, |
| (3) | సింధు | ,, | 46,378 | ,, |
| (4) | బెలూచిస్థాన్ | ,, | 54,228 | ,, |
| (5) | బెంగాలు | ,, | 82,955 | ,, |
| | మొత్తం విస్తీర్ణం | ,, | 2,88,998 | మైళ్ళు |

రమారమి 2 లక్షల 90 వేల మైళ్ళు గల హిందూ భూభాగమునకు "పాకీస్థాన్" అని పేరుపెట్టిరి. ఇందలి జనాభా

| | | |
|---|---|---|
| (1) | పశ్చిమోత్తర పరగణాలు | 24,25,603 |
| (2) | పంజాబు | 2,35,51,210 |
| (3) | సింధు | 38,87,070 |
| (4) | బెలూచిస్థాన్ | 420,648 |
| (5) | బెంగాలు | 5,00,00,000 |
| | మొత్తం జనాభా | 8,02,83,931 |

రమారమి 8 కోట్ల జనాభా గల యీమహమ్మదీయ రాజ్యమునకు రాబడి.

| | | రూపాయలు |
|---|---|---|
| (1) | పశ్చిమోత్తర పరగణాలు | 1,90,11,842 |
| (2) | పంజాబు | 12,53,87,730 |
| (3) | సింధు | 9,56,76,269 |
| (4) | బెలూచిస్థాన్ | |
| (5) | బెంగాలు | 36,56,62,485 |
| | మొత్తం రాబడి రు | 60,56,38,326 |

హిందూదేశములో మహమ్మదీయులు నూటికి యెంత మందికలరో యీదిగువ పట్టికనుబట్టి గ్రహింపవచ్చును.

| | | |
|---|---|---|
| (1) | బెంగాలు | 52.6% |
| (2) | బీహార్ మరియు ఒరిస్సా | 10.5% |
| (3) | బొంబాయి మరియు సింధు | 20.4% |
| (4) | మధ్యరాష్ట్రము | 4.3% |
| (5) | మద్రాసు | 6.5% |
| (6) | పంజాబు | 54.8% |
| (7) | సంయుక్తపరగణాలు | 14.0% |

హిందూదేశములోని వివిధజాతుల జనాభా.

| | | |
|---|---|---|
| (1) | హిందువులు | 20,61,17,326 |
| (2) | తురుష్కులు | 9,20,58,096 |
| (3) | హరిజనులు | 4,88,13,180 |

| | | |
|---|---|---|
| (4) | కొండజాతి | 2,54,41,489 |
| (5) | శిక్కులు | 56,91,447 |
| (6) | క్రైస్తవులు | 30,69,790 |
| (7) | ఆంగ్లోయిండియనులు | 1,40,422 |
| (8) | ఇతరులు | 83,459 |
| (9) | జైనులు | 14,49,286 |
| (10) | బౌద్ధులు | 2,32,003 |
| (11) | పారశీకులు | 1,14,890 |
| (12) | జ్యూలు | 22,480 |
| (13) | ఇతరులు | 4,09,877 |
| | మొత్తం జనాభా | 38,36,43,745 |

హిందూదేశములో మహమ్మదీయులవలన మాట్లాడబడు వివిధభాషలు వారి జనసంఖ్య.

| | | |
|---|---|---|
| (1) | ఉర్దూ | 2,07,91,000 |
| (2) | బెంగాలీ | 2,39,95,000 |
| (3) | పంజాబీ | 77,00,000 |
| (4) | సింధి | 29,12,000 |
| (5) | కాశ్మీర్ | 15,00,000 |
| (6) | పుస్తు | 14,60,000 |
| (7) | గుజరాతీ | 14,00,000 |
| (8) | తమిళము | 12,50,000 |
| (9) | మళయాళము | 11,07,000 |
| (10) | తెలుగు | 7,50,000 |

| | | |
|---|---|---|
| (11) | ఒరియా | 4,00,000 |
| (12) | బెలూచీ | 22,400 |
| (13) | బ్రహూలు | 1,22,000 |
| (14) | అరబ్బీ | 42,000 |
| (15) | పారశీకం | 22,000 |
| (16) | ఇతరభాషలు | 50,60,000 |
| | మొత్తం | 6,87,35,400 |

పాకీస్థాన్‌లోని మహమ్మదీయ జనసంఖ్య.

| | | |
|---|---|---|
| (1) | పంజాబు | 1,33,32,460 |
| (2) | పశ్చిమోత్తర పరగణాలు | 22,27,303 |
| (3) | సింధు | 28,30,800 |
| (4) | బెలూచిస్థాన్ | 4,05,309 |
| (5) | తూర్పుబంగాళాదేశము | 2,74,97,624 |
| (6) | శిల్హాట్ | 16,03,805 |
| | మొత్తం జనాభా | 4,78,97,301 |

(1) హిందూదేశములోని మహమ్మదీయ జనసంఖ్య
మొత్తం 6,64,42,766

(2) పాకీస్థాన్‌లోని మహమ్మదీయజనసంఖ్య
మొత్తం 4,78,97,301

(3) హిందూదేశములో మిగిలిన మహమ్మదీయుల జనసంఖ్య
మొత్తం 1,85,45,465

# కాశ్మీర్ సమస్య

ఇండియా పాకీస్థాన్‌లమధ్య వివాదమునకు కాశ్మీర్ సమస్య యిప్పుడు మరింత దోహద మగుచున్నది. దీని ప్రాధాన్యమును మనము వివరముగా తెలిసికొనుట అత్యావసరము. కనుక "కాశ్మీర్‌సమస్య ప్రాధాన్యం" అనే శీర్షిక క్రింద చక్కగా వ్రాయబడిన శ్రీ పండితారాధ్యుల నాగేశ్వరరావుగారి వ్యాసమును యీక్రింద పొందుపరచుచున్నాను.

## కాశ్మీరు సమస్య ప్రాధాన్యం

" 'రష్యా ఎవరి అధీనంలోవుంటే యావత్ప్రపంచము వారికి పాదాక్రాంతం కావలసిందే.' ఇది నెపోలియన్ అభిప్రాయం. ప్రపంచాధిపత్యంకోసరం యుద్ధాలు చేసిన ప్రతిఒక్కరు ఇలాగే అభిప్రాయపడ్డారు. నెపోలియన్ రష్యా ఆక్రమణకు చేసిన ప్రయత్నాలు విఫలమై, ఫ్రెంచి సామ్రాజ్యం విచ్ఛిన్నమైపోయింది. హిట్లర్ రష్యాను జయించడానికి జరిపిన యుద్ధంలో పరాజితుడై జర్మనీనే కోల్పోయినాడు. క్రిందటి శతాబ్దంలో నెపోలియన్ కృతకృత్యుడైవున్నా, ఈశతాబ్దంలో హిట్లర్ మనోరథం ఈడేరినా ప్రపంచచరిత్ర గతే పూర్తిగా మారిపోయి వుండేది. ఈసత్యాన్ని ఈనాడు క్రెమ్లిన్ అధికారులు నిస్సందేహంగా నిరూపించుతున్నారు. రష్యాలో కమ్యూనిజం ఏర్పడి, స్థిరపడింది కాబట్టి ప్రపంచ కమ్యూనిస్టు

సామ్రాజ్యాన్ని స్థాపించగలమని వారు భావిస్తున్నారు. మిగతా ప్రపంచం భయపడుతున్నది అదే. రష్యాకు ఇంత ప్రాముఖ్యం ఆ దేశ భౌగోళిక స్థానాన్నిబట్టే వచ్చింది. మాస్కోలో కూర్చుంటే మిగతా ప్రపంచం అంతా అంది పుచ్చుకున్నట్లు వుంటుంది.

మధ్య ఆసియాలో కాశ్మీరుకూడా ఇంచు మించు అదే స్థానంలో వుంది. 85 వేల చతురపు మైళ్ళు విస్తీర్ణంగల ఈ సంస్థానం అయిదు ప్రధాన రాజ్యాలను ఆనుకొనివుంది. ఉత్తరాన రెండు కమ్యూనిస్టు రాజ్యాలు రష్యా, చైనా, . తూర్పున పెకింగ్ ప్రభుత్వ అధీనమై కమ్యూనిస్టు చైనా వలసగా మారి పోయిన టిబెట్, దక్షిణభారతదేశం, పాకిస్తాన్, పశ్చిమాన పాకిస్తాన్, ఆఫ్ఘనిస్తాన్‌లు వున్నవి. కాశ్మీరుకు ఈ అయిదు రాజ్యాలూ అందుబాటులో వున్నట్లే ఈ అయిదు రాజ్యాలకూ కాశ్మీరు అందుబాటులో వుంది. వీటన్నింటి ప్రభావమూ కాశ్మీర్‌పై అంతో, ఇంతో కనిపిస్తూనే వుంటున్నది.

షేక్ అబ్దుల్లా సంస్థాన ముఖ్యమంత్రిపదవిని స్వీకరించిన తరువాత 'నవ్య కాశ్మీర్' నిర్మాణానికి తయారుచేసిన పథకాన్ని పరిశీలించితే కాశ్మీర్‌పై సోవియెట్ ప్రభావం ఎంత వుందో స్పష్టమౌతుంది. దాదాపు ఒక శతాబ్దంగా కాశ్మీరుకు భారత దేశంతో అత్యంత సన్నిహిత సంబంధం వుంటూవున్నందువల్ల కాశ్మీరీల జీవితంపై భారతీయ సంస్కృతి ప్రభావంకూడా కొంత

వరకు కన్పిస్తూ వుంటుంది. కాశ్మీరుసమస్య అంతిమంగా పరిష్కారమై కాశ్మీరీలు తమ వ్యవహారాలను సరిదిద్దుకో గలిగినప్పుడు కాశ్మీరు ఈ సరిహద్దురాజ్యాల సంస్కృతి, నాగరికతలను సమన్వయంచేసి ఒక నూత్న సంస్కృతిని ప్రసాదిస్తుంది. కాశ్మీరులో ఏం జరిగినా వాటి ఫలితాలను ఇటు భారతదేశం, అటు పాకిస్తాన్ సమంగా అనుభవించవలసివస్తుంది.

కనుకనే కాశ్మీరుభవిష్యత్తును తమ ఆశయాలకూ, లక్ష్యాలకూ అనుగుణంగా నిర్ధారించాలని పాకిస్తాన్, భారతదేశ పాలకులు ప్రయత్నిస్తున్నారు. ఈప్రయత్నాల్లో ఎవరు సఫలులైనా రెండోవర్గం అధఃపతనం చెందక తప్పదు. పాకిస్తాన్ బ్రతికి బట్టకట్టాలంటే కాశ్మీరు కరాచీ అదుపులో ఉండక తప్పదని పాకిస్తాన్ మంత్రులు, లోకం ఏమనుకుంటుందో అని కాక పోయినా, కాశ్మీరీలకు కరాచీ ఉద్దేశ్యాలను గురించి ఎలాంటి అనుమానాలు కలుగుతవో అనే ఆలోచనైనా లేకుండా, ప్రకటించారు. పాకిస్తాన్ ఆర్థిక వ్యవస్థ స్వయం సమృద్ధంగా వుండాలంటే కాశ్మీరు పాకిస్తాన్ అధీనంలో వుండక తప్పదని సర మహమ్మద్ జఫ్రుల్లాఖాన్ భద్రతామండలిలోనే ప్రకటించి వున్నాడు. ఆవిధంగా పశ్చిమరాజ్యాల సానుభూతిని పాకిస్తాన్ సంపాదించ కలిగింది. పాకిస్తాన్ కాశ్మీరు, ఆఫ్ఘనిస్తాన్, ఇరాక్‌లు ఒకే సమాఖ్యగా వుంటే—యూరపులోని బెనెలక్స్ దేశాల మాదిరి—సోవియట్ రష్యా పూర్వప, దక్షిణాన, పశ్చిమరాజ్యాలకు

చక్కని సైనిక స్థావరాలు లభిస్తవి. అమెరికా బ్రిటన్—పర్షియా తగాదానూ, పాకిస్తాన్—ఆఫ్ఘనిస్తాన్ తగాదానూ పరిష్కరించడానికి చేస్తున్న బ్రహ్మాండమైన ప్రయత్నాలను గమనిస్తే ఈ విషయం స్పష్టమైపోతుంది.

కాశ్మీరు సమస్యాపరిష్కారంలో బ్రిటన్ అమెరికాలు ప్రత్యేక శ్రద్ధ వహించడానికి కారణం కాశ్మీరుప్రజలమీదవున్న అభిమానమూ గాదు, పాకిస్తాన్—భారతదేశాల సఖ్యత ఆసియాలో సుస్థిర శాంతికి అత్యంతావశ్యకం అని నమ్మడం వల్లా కాదు. కాశ్మీరును పాకిస్తాన్‌కు కట్టబెడితే ఒక ప్రముఖముస్లిం రాజ్యం చిరకాలం తమకు లోబడి వుంటుందన్న ఆశే బ్రిటన్, అమెరికాలను ఆ దేశాలు ఇప్పు డనుసరిస్తున్న వైఖరికి ప్రోత్సహించినది.

ట్రీయస్టే ఇటు యుగస్లావియాకు చెందాలా అటు ఇటలీకి చెందాలా అన్న సమస్యపై సమయానుకూలంగా బ్రిటన్ అమెరికాలు, రష్యా అనుసరించిన విధానాన్ని జ్ఞప్తికి తెచ్చుకుంటే కాశ్మీరు విషయంలో వీరి విధానం సులభంగా గ్రహింపుకు వస్తుంది.

కాశ్మీరు ఈనాడు భారత పాకిస్తాన్ దేశాలకు జీవన్మరణ సమస్యగా తయారు కావడానికి బ్రిటన్, అమెరికాలు 1948 జనవరి నుంచీ అనుసరిస్తూ వచ్చిన విధానమే కారణం. సమితి ఈ రెండు రాజ్యాల ప్రాబల్యానికి లోబడి వున్నంతకాలం కాశ్మీరు

సమస్య పరిష్కారం కానే కాదు. మరి కొంతకాలం ఈ సం స్థానం ఇదేవిధంగా షేక్ అబ్దుల్లా, అజాద్ కాశ్మీర్ ప్రభు త్వాల అధీనంలో వుండిపోతే కాశ్మీరు విభజన ఎవరి తీర్పు అవసరం లేకుండా, ఏ జనవాక్యంకోసూ నిమిత్తం లేకుండా స్థిరపడిపోతుంది.

ఈ విభజనవల్ల పాకీస్తాన్‌కు ఎక్కువగా లాభించదు. కాని అమెరికా బ్రిటన్‌లకు కావలసిన పలకప్రాంతాలు మాత్రం పాకీస్తాన్ పరమై రష్యాపై దెబ్బ తీయడానికి అవసరమైన సైనిక స్థావరాలు మాత్రం లభిస్తవి. ఉత్తర కాశ్మీరులోని గిల్గిట్ ప్రాంతం ఐక్యరాజ్యసమితి కాశ్మీరుకమిషన్ భారతదేశాని కిచ్చిన వాగ్దానానికి విరుద్ధంగా పాకీస్తాన్‌లో కలిసిపోతుంది. బ్రిటన్, అమెరికాలు ఆ పరిస్థితితో తృప్తిపడగలవు. సర్ ఓవెన్ డిక్సన్ సంస్థాన విభజనే సమస్యా పరిష్కారానికి గల ఏకైక మార్గం అని ఖచ్చితంగా చెప్పినప్పుడు ఎవరూ మనస్ఫూర్తిగా అధిక్షేపించలేదు. శేషరతుగా ఎవ్వరూ నిరాకరించ లేదు.

మొట్టమొదటి కాశ్మీరు మధ్యవర్తి సంఘం యుద్ధ విర మణనాడు ఏ ప్రాంతం ఎవరి అధీనంలో ఉంటే ఆ ప్రాంతం వారి అధీనంలోనే వుండిపోవాలని, సంస్థాన భవిష్యత్తు జనవాక్య నిర్ధారణద్వారా నిర్ణయమయ్యేవరకూ ఆ ప్రాంతాలపై అబ్దుల్లా, అజాద్ కాశ్మీరు ప్రభుత్వాలే అధికారం చలాయిస్తూ వుండాలని తీర్మానించి నప్పుడే డిక్సన్ పథకానికి ప్రాతిపదిక ఏర్పడింది.

1948 ఆగష్టు 13, 1949 జనవరి తీర్మానాలను పాకీస్తాన్, భారత దేశాలు అంగీకరించడంద్వారా సంస్థాన విభజననుకూడా అంగీకరించినట్లే అయింది.

1947 ఆగస్టు 15 కు పూర్వం కాశ్మీరు భవిష్యత్తు విషయంలో అట్టే అంత ఆసక్తిని చూపని భారత ప్రభుత్వం ఆ సంవత్సరం అక్టోబరులో సైన్యాలను పంపి రోజుకు నాలుగులక్షల రూపాయల ఖర్చును భరించి దాదాపు సంవత్సరంపాటు పాకిస్తాన్ సేనలతో యుద్ధం సాగించడానికి గల కారణం ఏమిటి? భారతదేశ విభజనకు అంగీకరించి ఊహకు కూడా అందనటువంటి నష్టాన్ని, కష్టాన్ని భరించిన భారత ప్రభుత్వం ఈనాడు సర్ ఓయిన్ డిక్సన్ ప్రతిపాదనలను ఎందుకు అంగీకరించింది? పంజాబ్, బెంగాల్ రాష్ట్రాల్లోని దాదాపు సగ భాగాన్ని పాకిస్తాన్‌కు వదలుకున్న భారతప్రభుత్వం ఈ 85 వేల చతురపు మైళ్ళ సంస్థానంకోసరం నాలుగేళ్ళుగా ఇంత తాపత్రయం పడ్డానికి కారణం ఏమిటి?

కాశ్మీరు భవిష్యత్తు మీదనే భారతదేశ భవిష్యత్తు ఆధారపడివుంది. భారతప్రభుత్వ దేశాంగ విధానం, విదేశాంగ విధానం కాశ్మీరు సంస్థానాన్ని మనస్సులో పెట్టుకుని నిర్ణయం కావలసివుంటుంది. క్రిందటి సంవత్సరం పండిట నెహ్రూ అధ్యక్షతను ఢిల్లీలో జరిగిన కాంగ్రెస్ మహాసభ ప్రత్యేక సమావేశంలో పండిట్ నెహ్రూ, కాశ్మీర ప్రధాని 'షేక్

అబ్దుల్లాకూడా ఈ విషయాన్ని స్పష్టంచేశారు. కాశ్మీరు భారత దేశంతో చేరివుండాలంటే భారత దేశం సెక్యులర్ రాజ్యంగా ప్రవర్తిల్లాలని భారతప్రధానమంత్రీ, కాశ్మీరు ముఖ్యమంత్రి కూడా స్పష్టంచేశారు. కాంగ్రెస్ సంస్థలో వచ్చిన మార్పులకు, భారతప్రభుత్వ విధానానికి కాశ్మీరు సమస్యకు ఎంత సంబంధం వుందో గ్రహించడానికి ఇంతకంటే ఎక్కువ ఆధారాలు అవసరంలేదు. భారత దేశంలో "హిందూరాజ్యాన్ని" ఏర్పరిస్తే కాశ్మీరు ముస్లింలు పాకిస్తాన్‌లో చేరిపోతామని ప్రకటించటం తథ్యం. అంతే గాదు, అందువల్ల కాంగ్రెస్, గాంధి మహాత్ముడు ప్రతిఘటించిన ద్విజాతి సిద్ధాంతం భారత దేశంలో ఎక్కువ ప్రాబల్యాన్ని సంపాదిస్తుంది. పాకిస్తాన్ స్థాపన అన్ని విధాలా సమర్థనీయమని అందుకు బాధ్యులైనవారు చెప్పుకోడానికి మంచి ఉదాహరణ లభిస్తుంది.

కాశ్మీరు ద్విజాతిసిద్ధాంతం బూటకం అని ఋజువు చేసిందని ఆ సంస్థానానికి వెళ్లివచ్చిన విదేశస్థులందరూ, ప్రత్యేకంగా పాకిస్తాన్ అభిమానం లేనప్పుడు ప్రకటించారు. ఈమధ్యనే కాశ్మీరులో రెండు ప్రాంతాల్లోనూ పరిస్థితులను గమనించి వచ్చిన "మాంచెస్టర్ గార్డియన్" పత్రికవిలేఖరి కాశ్మీరు ప్రజల మనస్తత్వాన్ని వివరిస్తూ వారికి మతం ప్రధానంకాదనీ, ఏ దేశంతో చేరితే లాభంగా వుంటే ఆ దేశంతోనే చేరగలరని ప్రకటించింది. ఆజాద్ కాశ్మీర్‌కంటే అబ్దుల్లా అధీనంలో వున్న

కాశ్మీరులో ప్రజాసామాన్యం స్థితి తృప్తికరంగా వున్నందువల్ల కాశ్మీరుజనాభాలో హెచ్చుమంది అబ్దుల్లా చెప్పినట్లు చేస్తారని కూడా ఈ విలేఖరి నివేదిక తెలుపుతున్నది. అబ్దుల్లా ప్రభుత్వం ప్రవేశపెట్టిన భూమిసంస్కరణలవల్ల కాశ్మీరు రైతాంగం ఎక్కువ ప్రయోజనాలను పొందింది. పంట పొలం లేని రైతులకు అబ్దుల్లా ఆర్థికవిధానంవల్ల ఇంత జీవనోపాధి ఏర్పడింది. భారత ప్రజానీకానికి పండిత నెహ్రూ ఎలాగో, కాశ్మీరీలకు షేక్ అబ్దుల్లా అలాగని అంతా అంగీకరించిన విషయం. షేక్ అబ్దుల్లా శక్తి, సామర్థ్యాలను, దృక్పథాన్ని గ్రహించిన జిన్నా, కాశ్మీరు ప్రజలతో గాక కాశ్మీరు మహారాజుతో వ్యవహారం చేయ నిశ్చయించుకున్నాడు. కాశ్మీరు మహారాజు కాంగ్రెస్ విధానాలను తెలుసుకున్న వాడవటంవల్ల కాంగ్రెస్ పాలించే భారతదేశంతో చేరడంవల్ల తనస్థితి, స్థాయిలో రాగల మార్పులను గ్రహించిన వాడవడంవల్ల ఇటు భారతదేశంతో గాక, అటు పాకిస్తాన్‌తో సన్నిహిత సంబంధాలను ఏర్పాటుచేసు కొనడానికి ప్రయత్నించాడు. కాని పాకిస్తాన్‌లో చేరిపోవడానికి భయపడ్డాడు. 1947 ఆగస్టు 15 లోపున ఒక నిర్ణయానికి రాలేక బ్రిటిష్‌ప్రభుత్వం సలహాకోసరం ఠాకూర్ కల్యాణ్‌సింగ్‌ను లండన్ పంపించారు. కాశ్మీరు పాకిస్తాన్‌తోనే చేరాలని బ్రిటిష్ రాజకీయవేత్తలు సలహా ఇచ్చారు. అప్పుడు గవర్నర్ జనరల్‌గా వున్న లార్డ్ మౌంట్‌బాటన్ కూడా కాశ్మీరు భారతదేశంతో చేరాలని

ఖచ్చితంగా సలహా ఇవ్వలేకపోయినాడు. పైగా కాశ్మీరు మహా రాజా నిర్ణయాన్ని కాశ్మీరు ప్రజలు స్థిరపరచవలసిందనే షరతు పెట్టి సర్ హరిసింగ్ అభ్యర్థనను పున్నింపవలసిందని పండిట్ నెహ్రూకు సలహా ఇచ్చారు.

సర్ హరిసింగ్, ఆయన ఆశ్రితవర్గం కాశ్మీరును ఎటూ చేర్చక, పాకిస్తాన్, భారతదేశాలతో యథాతథపు ఒడంబడిక ద్వారా తమ హక్కులను, హోదాలను సంరక్షించుకోగల మని ఆశపడ్డారు. 1947 లో కాశ్మీరు మహారాజా తరఫున పాకిస్తాన్‌తో చేరికను గురించి రామచంద్రకాక్ సంప్రతింపులు కూడా జరిపారు. జిన్నా లాహోరులో కూర్చుని కాశ్మీరుపై దండయాత్రను ప్రారంభించకపోతే సంస్థానం ఏమైవుండేది ? సర్ హరిసింగ్ జిన్నా అభిమతానికి విరుద్ధంగా తనకు ఆత్మహత్యగా పరిణమించగల చర్యను తీసుకొనివుండేవారా ? పండిట్ నెహ్రూ ప్రధానమంత్రిగా వున్న భారతదేశంలో తాను కాశ్మీరు మహా రాజాగా వ్యవహరింపలేమని సర్ హరిసింగ్‌కు తెలియకపోలేదు. భారతదేశంలో చేరితే షేక్ అబ్దుల్లా ప్రధానమంత్రిగా సంస్థా నంలో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయక తప్పదని సర్ హరిసింగ్‌కంటే బాగా గ్రహించినవారు మరొకరు వుండరు. కాశ్మీరు జాతీయమహాసభను కాదని పాకిస్తాన్‌తో చేరితే సంస్థా నంలో అంతర్యుద్ధం తప్పదనికూడా కాశ్మీరు మహారాజుకు తెలు సును. కాని 1846 లో తమ పూర్వీకులు 50 లక్షల రూపాయ

లను సంపాదించినంత సులభంగా జునాను, ఈ కాశ్మీరును సంర క్షించుకోలేననిఖచ్చితంగా జిన్నా గ్రహించాడు. 'హార్ట్‌స్ట్రోక్' పడిన అస్వస్థ పడి, కనుక అట్టి ఫలితాలను అనుభవించాడు.

అయితే జిన్నా పాకిస్తాన్ అవతరించిన ఆరు వారాలకే తన దృష్టిని కాశ్మీరుపై కేంద్రీకరించడానికి గల కారణం ఏమిటి? పాకిస్తాన్ సంపాదనకు 1940 నుంచీ 1946 వరకూ ఓపిగ్గా, అతిజాగ్రత్తగా, అత్యంత ప్రతిభతో వ్యవహారం చేసుకు వచ్చిన క్వాయిదే అజాం కాశ్మీర్‌ను సంపాదించడానికి అంత త్వరపడడానికి కారణం ఏమిటి? పాకిస్తాన్ పరిష్కరించు కోవలసిన ఆర్థిక, కాందిశీక, సాంఘిక సమస్యలు అసంఖ్యాకంగా ఉండగా పాకిస్తాన్ గవర్నరుజనరలు ఈ సంస్థాన ఆక్రమణకు ఇంత ప్రాధాన్యం ఇచ్చి స్వయంగా యుద్ధాన్ని నడపడానికి గల కారణం ఏమిటి?

కాశ్మీరుసమస్య శీఘ్రంగా పరిష్కారం కావాలని పాకి స్తాన్ గవర్నరు జనరలు అభిప్రాయ పడ్డారు. సర్ హరిసింగ్ యథాతథపు ఒడంబడికస్తానే పాకిస్తానులో చేరికపత్రాన్ని సమ ర్పించాలని జిన్నా పట్టుబట్టాడు. ఎటూ తేల్చుకోలేని కాశ్మీర్ మహారాజా ఒక నిర్ణయానికి వచ్చేటట్లు చేయాలని ఆర్థిక దిగ్బం ధనం ప్రయోగించాడు. మూడువారాలు నిరీక్షించి చూశాడు. ప్రయోజనం లేకపోయింది. కాశ్మీరుపై దండెత్తమని కొండ జాతులవారికీ, పాకిస్తాన్ సైనికులకు ఉత్తరువు చేశాడు. వారికి

కాశ్మీర్‌ను జయించేందుకు అవసరమైన సహాయం చేయవలసిం దని పాకిస్తాన్ సర్వసేనాని ఆజ్ఞాపించాడు. సరిహద్దు దాడులుగా ప్రారంభమైన సైనికచర్యలు కాశ్మీరు యుద్ధంగా పరిణమించి నది. యుద్ధం ప్రారంభమైన ఇరవై రోజుల్లో పాకిస్తాన్ సేనలు కాశ్మీరు రాజధాని శ్రీనగర్‌కు 7000 గజాల సమీపంలోకి చేరి నవి, అక్టోబరు 26 న భారత ప్రభుత్వం కాశ్మీరు మహారాజా ఆర్తనాదాన్ని వినియించుకొని సైన్యాలను పంపడంలో రెండు రోజులు కాలహరణం జరిగితే పాకిస్తాన్ కాశ్మీరును ఆక్రమించు కొని తూర్పు పంజాబును కలుపుకోడానికి సన్నద్ధమై వుండేది. పూర్వు బెంగాల్ పాకిస్తాన్‌కు రాకపోయినా సింధు, తూర్పు పశ్చిమ పంజాబు, కాశ్మీరులు లభించివుంటే పాకిస్తాన్ నాయ కులు తృప్తి చెందివుండే వారు.

అటు కాశ్మీరు సంస్థానం ఇటు తూర్పు పంజాబు పాకి స్తాన్ వశమై వుంటే పాకిస్తాన్ వ్యాపసాయికంగా ఎంతో అభి వృద్ధి చెందివుండేది. కాశ్మీరు పాకిస్తాన్‌లో చేరాలని కరాచీ ప్రముఖులు వాదించడానికి పాకిస్తాన్‌కు కావలసిన నదీ జలం అంతా కాశ్మీరునుంచే రావాల్సి వుండడమే. కాశ్మీరు భారత దేశంలో చేరితే భారత ప్రభుత్వం పాకిస్తాన్‌లోకి ప్రవహిస్తున్న నదుల నన్నిటి గతిని మార్చి పాకిస్తాన్‌కు నీరు లేకుండా చేస్తుం దని కూడా పాకిస్తాన్ రాజకీయజ్ఞులు ప్రచారం చేశారు. అలా చేయాలనే వుద్దేశ్యం భారతదేశానికి వున్నప్పటికీ అది సాధ్యం

కాదని భారత ప్రభుత్వం స్పష్టం చేసింది. పాకిస్తాన్ — భారత దేశాలమధ్యవున్న కాలువ నీటి తగాయిదా పరిష్కారమైతే మిగతా సమస్యలు సులభంగా పరిష్కారం కాగలవని రెండు దేశాల్లోనూ పర్యటించి, అక్కడి పరిస్థితులను పరిశీలించి, స్థానిక నాయకు లతో చర్చలు జరిపిన డేవిడ్ లిలియన్తాల్ సూచించాడు.

పాకిస్థాన్ కాశ్మీరు విషయంలో అనుసరిస్తున్న విధానా నికీ సూడాన్ విషయంలో ఈజిప్టు అనుసరిస్తున్న విధానానికీ ఏమీ తేడా లేదు. ఈజిప్టు బ్రతుకుకు అత్యంతావశ్యకమైన నైల్ నది సూడాన్ నుంచే రావలసివుంది. ఈజిప్టు ఆర్థికంగా స్వయంసమృద్ధం కావాలంటే సూడాన్ ఈజిప్టు అధీనంలో వుండక తప్పదు. ఈవిషయాన్ని ఈజిప్షియన్లు, పాకిస్తానీల మాదిరే ఎంతమాత్రం కప్పిపుచ్చలేదు. కాని ఈజిప్టుకు సుడాన్ ను సాధనంచేయడానికి నిరాకరించి, సుడాన్ స్వతంత్ర రాజ్యంగా ఏర్పాటు చేయడానికి యావచ్ఛక్తినీ వినియోగి స్తున్న బ్రిటన్ కాశ్మీరును మాత్రం పాకిస్తాన్ కు కట్టబెట్టడానికి సంకోచించడం లేదు. కాశ్మీరుప్రజల అభిమతాన్ని తెలుసు కొనడం అవసరం అని అయినా భావించడం లేదు.

వీటన్నింటివల్లా కాశ్మీరు సమస్యకు ఎంతో ప్రాధాన్యం వుందనీ అది కేవలం భారత పాకిస్తాన్లకు మాత్రమే సంబంధిం చింది గాదనీ, అగ్రరాజ్యాలన్నీ కాశ్మీరు భవిష్యత్తులో ఆసక్తి కలిగివున్నవని స్పష్టమౌతున్నది.

ఈసమస్యాపరిష్కారానికి భద్రతామండలి ఇప్పటికి నాలుగు సంవత్సరాలుగా మార్గాన్వేషణ చేస్తున్నది. భారత ప్రభుత్వం పాకిస్తాన్ కాశ్మీరు సంస్థానంపై దురాక్రమణ జరిపిందని భద్రతామండలికి ఫిర్యాదుచేసి నాలుగు సంవత్సరాలైంది. యుద్ధచర్యల విరమణజరిగి మూడు సంవత్సరాలైంది. యీ నాలుగేళ్లలోనూ ఎందరో ఎన్నో పరిష్కారమార్గాలను సూచించారు. మొట్టమొదట భద్రతామండలికి అధ్యక్షుడుగా వున్న చైనా ప్రతినిధి డాక్టర్ ట్సియాంగ్ భారతప్రభుత్వ ఫిర్యాదును శ్రద్ధగా పరిశీలించి కొన్ని ప్రతిపాదనలను చేశారు. భారతప్రభుత్వం ఈ ప్రతిపాదనలను అంగీకరించింది. పాకిస్తాన్ నిరాకరించింది. ఆ తరువాత ఈ కాశ్మీరు తగాయిదాలను భారత–పాకిస్తాన్ తగాదా విస్తరింపజేయడానికి తద్వారా పాకిస్తాన్ దురాక్రమణను కప్పిపుచ్చడానికి సర్ మహమ్మద్ జఫ్రుల్లాఖాన్ చేసిన ప్రయత్నాలు ఫలించి ఐక్యరాజ్యసమితి కాశ్మీరు కమీషను ఏర్పడింది. ఆకమీషన్ జరిపిన విచారణ ఫలితంగా కాశ్మీరుపై పాకిస్తాన్ దురాక్రమణ జరిపిందని ఋజువైంది. భద్రతామండలి గ్రీసు విషయంలో అల్బేనియా, యుగస్లావియా, బల్గేరియా, రుమేనియా దేశాలను హెచ్చరించినట్లు కాశ్మీరు విషయంలో పాకిస్తాన్‌ను హెచ్చరించడానికి బదులు, కాశ్మీర్‌పై దురాక్రమణ జరుపుతున్నవారికి ఏవిధంగానూ సహాయపడరాదని పాకిస్తాన్ ఆదేశించడానికి బదులు కాశ్మీరును భారత–

పాకిస్తాన్ దేశాలను ఏ విధంగా పరిపక్వం చేస్తామనే ఆలోచించ డం ప్రారంభించింది. కాశ్మీరు కమీషన్ ప్రతిపాదనలను భద్రతా మండలి అమలుజరుపగల్గి వుంటే, లేదూ తరువాత కాశ్మీరు మధ్యవర్తిగా వచ్చిన సర్ ఓయిన్ డిక్సన్ ప్రతిపాదనలను అమ లుజరుపగల్గి వుంటే, కాశ్మీరు సమస్య ఈనాడింత క్లిష్టమై వుండేది గాదు. మొదట కాశ్మీరుకమీషను పాకిస్తాన్ సేనలు కాశ్మీరు సంస్థానం భూభాగంపై వున్నట్లు వెల్లడించింది. సర్ ఓవెన్ డిక్సన్ కాశ్మీరులో పాకిస్తాన్ సేనల ఉనికి అంతర్జాతీయ ధర్మసూత్రాలకు విరుద్ధం అని ప్రకటించారు. ఈవిధంగా తీర్పు లివ్వడంతోనే వీరు తృప్తిపడ్డారు గాని ఆ తీర్పులను అమలుచేయ డానికి అసలు ప్రయత్నించనే లేదు.

ఇప్పుడు డాక్టర్ ఫ్రాంక్ గ్రాహాం కాశ్మీరుసమస్యా పరి ష్కారానికి ఆఖరు ప్రయత్నం చేస్తున్నారు. అనేక చిల్లర విషయాలపై వీరు భారత—పాకిస్తాన్ సమాధానాన్ని సాధించ గలిగారు; కాని అసలు సంస్థానభవిష్యత్తు నిర్ధారణకు సంబం ధించిన రెండు ప్రధాన విషయాలమీదా 1948 లో ఎంతటి భేదాభిప్రాయం వుందో 1952 లోనూ అంతటి భేదాభిప్రాయము వుంది.

కాశ్మీరు నుంచి భారత, పాకిస్తాన్ సేనల వుపసంహరణ విషయంలో మెక్నాటన్ ప్రతిపాదనలతో ప్రారంభమైన అన్యా యం ఇప్పటివరకూ అలా వస్తూనే వుంది. కాశ్మీరు కమీషన్

సంస్థాన శాంతి భద్రతలరక్షణకు అవసరమైన సేనను భారత ప్రభుత్వం స్థావరంగా వుంచవచ్చుననీ, పాకిస్థాన్ సేనల ఉపసంహారం మాత్రం జరగాలనీ సూచించింది. అంతేగాక గిల్గిట్ ప్రాంతంపై పరిపాలనాధికారం షేక్ అబ్దుల్లా ప్రభుత్వపరం కావాలన్న సూచననుకూడా కాశ్మీరు కమిషన్ హర్షించింది. ఇప్పుడు డాక్టరు ఫ్రాంక్ గ్రాహం ఇరుపక్షాల సేనల బలం ఒక్కటిగానే వుండాలని సూచిస్తున్నారు. భారతప్రభుత్వం ఈ సూచనను ఎప్పటికీ అంగీకరించదు. ఇక రెండవది—జనవాక్య నిర్ధారణ కార్యక్రమాన్ని ప్రారంభించడానికి అనుకూలమైన పరిస్థితులు ఏర్పడేందుకుముందుగానే జనవాక్య నిర్ధారణాధికారిని నియమించాలని గ్రాహం ప్రతిపాదించాడు. ఈ రెండూ పాకిస్తాన్‌కు అనుకూలమైనవే. భారతదేశం ఈ ప్రతిపాదననూ అంగీకరించదు.

హైద్రాబాదు సమస్య సమితి చర్చనీయాంశాల జాబితాలో వుంటూవుండగానే శాశ్వతంగా పరిష్కారమైపోయినట్లుగానే ఈ కాశ్మీరుసమస్యా పరిష్కారం కావాలి. అందుకు ప్రస్తుతం సంస్థానంలో ఏర్పడిన రాజ్యాంగపరిషత్తు దోహదం చేస్తుంది. కాబట్టే ఈ పరిషత్తుకు ఎన్నికలు జరక్కుండా చేయాలని, పరిషత్తు సమావేశం కాకుండా చేయాలని పాకిస్తాన్ ప్రభుత్వం స్వయంగానూ, భద్రతామండలి ద్వారానూ శాయశక్తులా ప్రయత్నించింది. సరిహద్దులలో తిరిగి సైనిక చర్యలు

జరపడానికి సహాయపడ్డారని. భారతప్రభుత్వం ముందుగానే గ్రహించి అవసరమైన చర్యలు తీసుకున్నది. పాకిస్తాన్ కొత్త పథకం ఈవిధంగా విఫలమైపోయింది. షేక్ అబ్దుల్లాను అపహరించడానికి కుట్రలుపన్నింది. అదీ లాభంలేకపోయింది. కాశ్మీరు అభ్యుదయమార్గాన పురోగమిస్తున్నది. ప్రక్కనవున్న ఆజాద్ కాశ్మీర్లో అరాచకం ప్రారంభమైంది. తిండి, బట్టకోసరం ప్రజలు, అధికారం కోసరం ఆజాద్ కాశ్మీర్ నాయకులు తిరుగుబాటు చేశారు. సర్దార్ ఇబ్రహింఖాన్ తిరిగి ఆజాద్ కాశ్మీరు అధిపతి కావడానికి కుట్రలు పన్నాడు. తత్ఫలితంగా కలనల్ అహమ్మద్షా పదభ్రష్టుడైనాడు. అంతటితో మహమ్మద్ అబ్బాస్ ప్రాబల్యం అంతరించింది. ఆజాద్ కాశ్మీరు వ్యవహారాల్లో స్థానికనాయకులకు ప్రమేయం లేకుండా చేసి ఆజాద్ కాశ్మీరు కొంతభాగాన్ని అటు పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రానికీ, కొంతభాగాన్ని పశ్చిమపంజాబుకు కలిపివేయడానికి అనుకూలమైన పరిస్థితులు ఏర్పడ్డవి. ఇవాళ అజాద్ కాశ్మీరు అధిపతిగా నాజీముద్దీన్ చే ప్రతిష్ఠింపబడిన షైక్ మహమ్మద్ యూసఫ్ అవకాశవాది. షేక్ అబ్దుల్లాను దూషించడానికి కాశ్మీరు మహారాజా ఒకప్పుడు ఇతన్ని తనప్రక్కన వుంచుకున్నాడు. పాకిస్తాన్ కాశ్మీరుపై దురాక్రమణ జరపగానే ఈయన పాకిస్తానుకు పారిపోయి పాకిస్తాన్ నాయకుల అడుగులకు మడుగులొత్తుతూ కాలక్షేపం చేస్తున్నాడు.

వీలైనంత శీఘ్రంగా పాకీస్తాన్‌లో ఆజాద్ కాశ్మీరు ప్రాంతాన్ని కేంద్రపరిపాలిత రాష్ట్రంగా గాని లేక ఉత్తరప్రాంతాన్ని సరిహద్దు రాష్ట్రంలోనూ దక్షిణప్రాంతాన్ని పశ్చిమ పంజాబులోనూ కలిపివేయడంగాని చేయకపోతే డాక్టర్ గ్రాహాంతో పాకీస్తాన్‌తో జరుపుతున్న సంప్రతింపులలో తనకూ స్థానం కావాలని ఆందోళనచేసిన సర్దార్ ఇబ్రహీం చివరికి పాకీస్తాన్‌కే 'ఎసరు' పెట్టి అబ్దుల్లాతో చేతులు కలిపినా కలపవచ్చు. ఆ ప్రమాదాన్ని నివారించడానికే పాకీస్తాన్ ప్రయత్నిస్తున్నది. ఆవుద్దేశ్యంతోనే ఆజాద్ కాశ్మీరుప్రభుత్వాన్ని పునర్నిర్మించింది. ఆ వుద్దేశ్యంతోనే అటు సరిహద్దురాష్ట్రంలోనూ, ఇటు పశ్చిమ పంజాబులోనూ ప్రతీపవర్గాలను అధికారంలో ప్రతిష్ఠించడం జరిగింది.

కాశ్మీరు సమస్య ఇంతలో పరిష్కారంగాదు. కాని కాశ్మీరు భారతదేశాంతర్భాగమనే విషయాన్ని గమనించే భారత రాజకీయపక్షాలు, అధికారంలోవున్నా లేకపోయినా తమవిధానాలను, ప్రణాళికలను నిర్ణయించుకోవలసివుంటుంది. కాబట్టే పండిట్ నెహ్రూ మతకుల తత్వాలను పనిగట్టుకొని ఖండిస్తున్నారు. మతసంఘాలను విమర్శిస్తున్నారు.

"కాశ్మీరు భారతదేశానికి చెందినదే". అని షేక్ అబ్దుల్లా అనేక పర్యాయములు ప్రకటించారు. ఆప్రకారంగానే కాశ్మీరు రాజ్యాంగపరిషత్తు తీర్మానిస్తుంది. అంతమాత్రంచేత

కాశ్మీరు భారతదేశంలో కలిసిపోవడం జరుగదు. హైదరాబాద్ సమస్యను పరిష్కరించినట్లుగా కాశ్మీరుసమస్యను పరిష్కరించడం సాధ్యంకాదు.

భారతదేశ ఉత్తరసరిహద్దుల రక్షణకు కాశ్మీరు మనకు అవసరం. సరిహద్దుల్లోవున్న కాశ్మీరీలు సంతుష్టులై భారతదేశం అంటే ప్రాణాలర్పించేటట్లు ఉండాలి. అది మతాధార రాజ్యాన్ని స్థాపించడంద్వారా సాధ్యంగాదు. పండిట్ నెహ్రూ విధానాలను అవగతం చేసుకోవడానికి ఈ కాశ్మీరుసమస్య ప్రాధాన్యాన్ని తెలుసుకోవడం అవసరం. (భారతినుండి)

పైవ్యాసమునుబట్టి యీ కాశ్మీరు సమస్యయొక్క ప్రాధాన్యత విశదమగుచున్నది. మహమ్మదీయప్రభుత్వపు వారినుండి కాశ్మీరమును తప్పించుటకై భారతప్రభుత్వము కాశ్మీర్ మహారాజునకును, ముఖ్యమంత్రి షేక్ అబ్దుల్లాకును యిచ్చిన వాగ్దానానుసారం మనసైన్యముల నచ్చటకు పంపి తగిన కట్టుదిట్టములు జరిపి పాక్ ప్రభుత్వ విజృంభణము నరికట్టినది. మనప్రభుత్వ మిట్టిచర్యకు దిగనిపక్షమున పాకీస్థాన్ ప్రభుత్వము ఏనాడో బలహీనుడైన కాశ్మీర్ రాజుయొక్క సర్వ సైన్యములను రూపుమాపి దాని నాక్రమించుకొనియుండెడిది. సకాలములో మనప్రభుత్వము సక్రమచర్య గైకొనినది గనుకనే యీనాడు కాశ్మీరము తమ స్వంతప్రజలచే పరిపాలింపబడుచున్నది. మహారాజు పదవినుండి తొలగింపబడినాడు. ప్రజోప

యోగ్యమైన భూసంస్కరణవిధాన మమలులోనికి వచ్చినది. భారతప్రభుత్వపు అండనుజేరుటవల్లనే కాశ్మీరమున కీసౌభాగ్య స్థితి చేకూరిన దని విజ్ఞులాదరు వెల్లడించుచున్నారు. కాని యింతటితో చాలదు. అతిత్వరలో యీసమస్య శాశ్వతముగ పరిష్కారమగుట అత్యవసరము. ఇటీవల పాకీస్థాన్ ప్రధాని భారతప్రధానితో యీవిషయమును శాంతియుతముగ పరిష్కరించుటకై సంప్రదింపులు జరుపుచున్న సంగతి మనకు తెలియును. ఈసంప్రదింపులయినను సఫలమై, కాశ్మీర్ సమస్య సక్రమముగా పరిష్కరింపబడవలెనని మనకోరిక.

## ము గిం పు

ఇంతవరకు వ్రాయబడిన చరిత్రనుబట్టి పాకీస్థాన్ నిర్మాణమునకు మహమ్మదీయులు జరిపిన కృషి, క్రైస్తవప్రభుత్వము వారికి చేసిన దోహదము, విభజనపర్యవసానముగ వాటిల్లిన కష్టనష్టములు తెలియుచున్నవి. ఇటువంటి యిక్కట్లు పెక్కులు సంభవించగలవను విషయము గ్రహించియే మనవారు మొదట విభజన కంగీకరింప లేదు. కాని పరిస్థితుల ప్రాబల్యమువల్ల తప్పనిసరిగా అంగీకరింపవలసివచ్చినది. దేశములోని స్వరాజ్యాందోళనము విప్లవరూపము దాల్చిన దను విషయము బ్రిటిషుప్రభుత్వమువారు గుర్తించుకొని యిక యీదేశమును వీడిపోవక తప్పదని నిశ్చయించుకొనిరి. ప్రజాబాహుళ్యములోనే గాక పోలీసుదళములోను- సైనికులలోను- నావికులలోను-

విమానదళములలోను కూడా ప్రభుత్వముపై తిరుగుబాటు సంభవించుటచే బ్రిటీషువారు మరింత దద్దరిల్లిరి. దీనికితోడు ఒకవంక కాంగ్రెస్- మరొకవంక అజాద్‌హింద్ ఫౌజు, యీ విప్లవోద్యమమును తీవ్రముగ రెచ్చగొట్టినవి. ప్రజలలోనే గాక ప్రభుత్వశ్రేణులలోకూడ యీ వుద్యమము తీవ్రతర మగుటచే తక్షణమే రాజ్యపరిత్యాగముచేసి వెడలిపోవుటకు బ్రిటీషువారు ఏర్పాట్లుచేయ నారంభించిరి. మౌంటుబాటన్ గవర్నరుజనరలుగా రాగానే యీ కార్యకలాపములు ప్రారంభించి యిటు హిందువులతోను అటు మహమ్మదీయులతోను మంతనములు జరిపెను. వాటిఫలితముగ దేశవిభజనకు మన మంగీకరించినచో బ్రిటీషుప్రభుత్వమువారు వెంటనే రాజ్యము విడిచి వెడలిపోవుటకు నిశ్చయించుకొన్నా రనురూఢివార్త తెలియగనే, ఏస్వల్పకష్టనష్టముల కోర్చిఅయినా చిరకాలము నుండి పాతుకుపోయిన బ్రిటీషుప్రభుత్వమును వదలించుకొనినచో దేశములోగల చిన్నచిన్న యితరసమస్యలను ఎట్లయిన మనము పరిష్కరించుకొనవచ్చునని భావించి తప్పనిసరిగా కాంగ్రెస్‌వారు విభజన కంగీకరించిరి. దేశమును విభజింపవలదనియు, అవసరమైనచో మహమ్మదీయులనే అధిపతిగానుంచి పరిపాలనసాగించుట కభ్యంతర ముండదనియు మనవారు కొంతమంది సూచించిరి కొందరు కాంగ్రెసువారు- హిందూమహాసభవారు- అజాద్‌హింద్‌ఫౌజువారు- రాష్ట్రీయ స్వయంసేవక

సంఘమువారుకూడ దేశవిభజనకు వ్యతిరేకులుగనే యుండిరి. కాని ఎట్లయిన నిచ్చటినుండి బ్రిటీషువార్ని పంపివేయవలెనను ముఖ్యాశయము నెరవేర్చుకొనుటకై మనముకూడా విభజన కంగీకరింపక తప్పినదికాదు. దీనితో బ్రిటీషువారిపథకము కుదిరినది. మౌంటుబాటను దేశవిభజనసంఘ మేర్పాటుచేసి తానధ్యక్షుడై 1947 వ సం॥రము ఆగస్టు 15 వ తేదీ నాటికి విభజన కార్యకలాపములు పూర్తిచేసి రెండు భాగములకును రెండుసరిహద్దు లేర్పరచి ఎవరిభాగములు వారి కప్పగించి పాలనా బాధ్యతలువారికి వదలివేసెను. అంతవరకు "అఖండభారతము" గా వర్ధిల్లిన భారతావని నాటితో రెండుఖండములుగా చీలి పోయినది. అప్పటినుండియు స్వతంత్రరాజ్యములకొరకు ఉభయ రాజ్యములకు చిన్నచిన్న తగవులు జరిగినవికాని వీటిలో చిలికి చిలికి గాలివానగామారిన దీకాశ్మీరసమస్యయే. హైదరాబాదు సమస్యకూడ కొంతతీవ్రరూపము దాల్చినను తుదకది సవ్యముగానే ముగిసినది. మిగిలిన యీకాశ్మీరసమస్యకూడ సవ్యముగ పరిష్కారమైనచో యిక పాకిస్థాన్ తిరిగి మనదేశములో నైక్యమై "అఖండభారతము" గా వర్ధిల్లుటకు హిందువులు, మహమ్మదీయులుగూడ కృషిసల్పవలెను. ఏనాటికైనా యీ రెండురాజ్యములు కలసిపోవుటయే రెండింటి శాంతిసౌభాగ్యములకు పునాదికాగలదు. కనుక ఉభయదేశములలోను యిందు కవసరమైన ప్రచారము విరివిగా జరిపి అనుకూలవాతావరణ

మేర్పించవలెను. ఈకర్తవ్య నిర్వహణకు ఉభయ దేశముల మధ్య సుహృద్భావ మవసరము. ఒక్క సుహృద్భావమే కాదు దానితోబాటు సహనశక్తి యుండవలెను. ఈ రెంటికీ ధైర్యసాహసములు తోడుగావలెను. రెండు రాజ్యములవారును హృదయపూర్వకముగ నిష్కల్మషముగ యిందుకు పాటుపడినచో తిరిగి యీనాడు కాకపోయిన మరొకనాడైన నఖండభారత మవతరించగలదు. అప్పుడే యిటు హిందువులు— అటు మహమ్మదీయులు గూడ శాంతియుత వాతావరణములో సర్వసంపదలతోను, సౌభాగ్యలక్ష్మితోను తులతూగగలరు.

అప్పుడే మహాత్మాగాంధీవంటి మహాపురుషులు గన్న కలలు— చేసిన తపస్సు— జరిపిన కృషి ఫలించి వారి పవిత్రాత్మలు శాంతించగలవు.

—జై హింద్.

## త్వరలో వెలువడనున్న

శ్రీ కోటమర్తి చినరఘుపతిరావుగారి

## ఉత్తరగ్రంథాలు

## "సుయోధన విజయము"

(రసవత్తర పద్యనాటిక)

మూడవముద్రణ

వెల : ఒకరూపాయి

## "వెన్నెల వెలుగులు"

(నవ్యాంధ్రకవుల సంగ్రహచరిత్ర)

వెల : ఒకరూపాయి

## "అష్టమి"

(విమర్శాత్మక నాటికలసంపుటి)

వెల : ఒకరూపాయి


పాంచజన్యం పబ్లికేషన్స్,

కాకినాడ.

## వెలువడుతోంది

వివిధరంగాలలో ఆరితేరిన నవ్యాంధ్రప్రముఖుల జీవిత విశేషాలు తెలిపే అత్యుత్తమ గ్రంథం.

# "ఆంధ్రప్రముఖులు"

రచయిత:

శ్రీ దంటు కృష్ణమూర్తి

(బాపూజీ- పండిట్ నెహ్రూ- రాజేంద్రప్రసాద్- వీరేశలింగ చరిత్ర- విశ్వదాత, గ్రంథాల రచయిత)

వెల: రెండురూపాయలు

## పాంచజన్యం పబ్లికేషన్స్,

కాకినాడ.

# ట్రాక్టర్లు

ప్రభుత్వమువారి పంచవర్ష ప్రణాళిక ననుసరించి దేశాభివృద్ధికి ముఖ్యావసరమైన వ్యవసాయమును బాగుగా వృద్ధిపరచుటకు వలయు—

# ట్రాక్టర్లు - బుల్‌డోజరు

మావద్ద అద్దెకుగాని, కంట్రాక్టుకుగాని లభించును. వ్యవసాయమునకు యీయంత్రములసహాయ మత్యావసరమని అన్ని దేశములవారు అంగీకరించిన విషయమే. కనుక వ్యవసాయదారు లందరూ యీ అవకాశమును వినియోగించుకొని వివరములకు క్రిందివారితో సంప్రతించుడు.

**శ్రీ వినాయక మాన్యుఫ్యాక్చరింగ్ కంపెనీ,**

మెయిన్‌రోడ్డు: రాజమహేంద్రవరం.

శ్రీపతి ప్రెస్, కాకినాడ.

